## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000001243

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఋజువర్తనులు, జవసంపన్నులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శతపత్రసుందరి

## గేయసంపుటి

బాలాంత్రపు రజనీకాంతరావు, బి. ఏ., ఆనర్సు.

# విజ్ఞప్తి



పేరునకు శతపత్రసుందరియైనా దీనిలోని పాటల రేకులు రెండువందలకు మించాయి. దాదాపు 17 ఏళ్లనుంచి రచించి పాడుకొంటూవచ్చిన ముక్తకములవంటి ఏకగేయాత్మక ఖండ కావ్యములు, కొన్ని నాటకములలోని ఆయా రసవత్సన్నివేశ ములలోని గేయములు అన్నీ కలిసి 260 వరకు ఈసంపుటముగా పేర్చి కూర్చాము. లోపలి రసభావవిన్యాసముల ననుసరించి ఈ గేయపురేకులను స్థూలముగా చాలమట్టుకు వసంతపత్త్రావ ళీత్యాదిగా వరుసగా ఆరు ఋతువులను సూచించే ఆరుగుత్తుల లోనికిని, కొన్ని జాతీయగీతములను, మరికొన్ని నూతనగీతము లను నవవసంతపత్త్రావళి అను ఏడవగుత్తిలోనికిని చేర్చాము. వీనిలో 20 మాత్రము రవీంద్రునిగీతములకును, ఇతర సంస్కృ తాంగ్లాదికవులరచనలకు పరిమళమాత్రానువాదములు. మిగిలిన వన్నీ స్వతంత్రరచనలే.

ప్రకాశకులు.



పూజ్యులు, పితృపాదులు

కవికులాలంకారులు, కవిరాజహంసలు

**శ్రీ వేంకటపార్వతీశ్వరకవులకు**

సద్భక్తివిరచనపుష్పహారముగా అంకితము

# “నా నాన్నా! మామయ్యా!”



మా నాన్నా! మా మామయ్యా!
నే విన్నా మీ సన్నిధినే!
నడిచినయుగముల మహాకవివరుల
కవితారీతుల ఘనతలనూ, ఈ
నవయుగమున కాది ఘనత నందిన
కవిభావుక నవఫణితులను
గంగాయమునాసంగమంబుగా
కలిసికొనిన మీకవనములో నే
నే విన్నా మీసన్నిధినే!
మా నాన్నా! మామయ్యా!!

*

సమితుల చేరని కవితలు చదవక
వలపతమ్ముల మనసులతో
నవయుగకర్తలు వా రని వీ రని
ఎవ రేమన్నా ఒకటి నిజం!
ఆ యుగకర్తల శైశవమందే
మీ యువలేఖిని వ్రాసినకైతలు
కావ్యకుసుమశంఖారావముగా
నవ్యయుగపు వైతాళికరుతిగా
నే విన్నా మీ సన్నిధినే!
మా నాన్నా! మా మామయ్యా!!

లేదు నిదురలో లేదు సుగతి యని
చూడు కనువిచ్చి జగతి యని
గోవర్ధనమే మాతృదేశ మని
గోపకులంతా దేశప్రజ యని
దేశనేత గోకులకృష్ణుం డని
దేవేంద్రుండే శ్వేతప్రభు వని
పితతూర్పుజల నేల మాన రని
జాతిని మేల్కొలిపే మీ గీతులు
నే విన్నా మీ సన్నిధినే!
మా నాన్నా! మా మామయ్యా!!

*

తేటగీతముల తెన్నులలో
మేటిసీసముల వన్నెలలో
బహుళవృత్త నవభంగులలో
ఆంధ్రభారతి వెలుంగులలో
ప్రకృతిసౌందర్య యవనికలా
వికృతివివేక కనీనికలా
శ్రీసూక్తి నవసుధానిధిలో
భావసంకీర్తనాంబుధిలో
రమణు నేకాంతసేవనము
రమ్య మధుర బృందావనము

నే విన్నా మీ సన్నిధినే !
మా నాన్నా ! మా మామయ్యా !!

* * *

బడికి పోకయే పొత్తము పట్టకె
గిరగిర తిరుగుచు వ్రాయగ నేర్చిన
బాలగీతముల బొంగరమట్టుల
బాల్యమునందే మీ యొడులందే
పడుకొని కైతలు విని విని వెంటనె
కాకిమీదనో ఆవుమీదనో
ఆకసమ్ములో అంచలపైనో
నా కేరింతలు, మీ యూరింతలు
నే విన్నా మీ సన్నిధినే !
మా నాన్నా ! మా మామయ్యా !!





శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు

(ఆశీస్సు)

# ఆశీస్సు

"శతపత్ర సుందరీ! ఓహో శతపత్రసుందరీ!"
"మ్రోయింపు జయభేరి
వాయింపుము నగారా!"
"మాదీ స్వతంత్ర దేశం
మాదీ స్వతంత్రజాతి!"

ఇత్యాది ఆబాలగోపాలపరిచితములైన కీర్తనలలో ఏదేని ఏ సందర్భమున నేని పాడుటకు ఉపక్రమింపబడినప్పుడు "అదిగో రజనీకాంతరావు పాట" అని హర్షవికసితములైన మోములతో శ్రోతృజనము తదేకాయత్తచిత్తమై ఆగేయమును మధురరసమునువలె తనివితీర గ్రోలి, అర్ధనిమీలితనేత్రపారవశ్యసుఖ మనుభవించుట నేను అనేకపర్యాయములు అనేక సభలలో ప్రత్యక్షముగా విలోకించి, నాశిష్యుడు ఆర్జించుకొన్న యశమునకును ఆతనియెడ సమస్తాంధ్రప్రజకు గల అనురంజనమునకును లోలో మురియుచుందును.

రజనీకాంతరావునకు నాగురుత్వమువలన ఏమైన కొంత వ్యుత్పత్తియు కొంతసంస్కృతియు కలిగియుండవచ్చునేమో

కాని, కవిత్వముమాత్రము నావలన అలవడినదికాదు. ఆగురుత్వము ఆతని జనకునిది.

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు జగమెరిగిన జంటకవులు. ఆ జంటలో శ్రీ వేంకటరావుగారు ఇతని తండ్రిగారు. ఈకుమారుడు "బడికిపోయి పొత్తము పట్టని" బాల్యమునందే తండ్రి యొడిలో పరుండి, ఆయన లాలించుచు వినిపించిన కవితాగానఫణితులను వినివిని కడుపార పాలుత్రావిన శిశువు త్రేన్చినట్లు "కాకిమీదనో ఆవుమీదనో ఆకసములో అంచలపైనో" కేరింతలు కొట్టుచు చిటిపొటిపాటలు అల్లుట, ఈ కవితోద్యానమునకు మొదటి అంకురములు.

ఆ యుద్యానలతలు గోముగా నలుదెసల ప్రాకి, పరిమళకుసుమభరితములై, జగదాహ్లాదన మొనర్చునట్లుగా వర్ధిల్లుటకు వలసిన దోహద మంతయు రజనీకాంతరావు స్వయంకృషివలననే జరిగినది. ఈ తండ్రికొడుకులవిషయముననే కాదు; లోకములో ఇతర గురుశిష్యులవిషయము నందైనను కవితాసంప్రదాయము ఈరీతిగానే ప్రవర్తిల్లును: గురూపదేశము శిష్యునిహృదయమున నిగూఢమై అణగియున్న కవితాబీజమును ఉద్భిన్న మొనర్చు జలకణసేచనము. అంకురించుట మొదలుగా ఆ లతకు నానాదోహదము లొనర్చి, ఏమరుపాటులేని శ్రద్ధతో కాపాడి పుష్పఫలసమృద్ధ మొనర్చుకొనుట శిష్యుని కృషి.

గురువు ఉపదేశదక్షుడు కాడేని శిష్యునిలో బీజ ముండియు అంకురింపదు. శిష్యుడు దోహదకుశలుడు కాడేని మొలకెత్తియు అంకురము వర్ధిల్లదు. ఈ రెండువ్యాపారములును సముచితముగా సంఘటిల్లుట ఈశ్వరానుగ్రహము. అట్టి యీశ్వరానుగ్రహము కలిమి రజనీకాంతరావు నేటికవులలో అందును గేయకవులలో అందును వాగ్గేయకారులలో ఉత్తమస్థానమును దక్కఁగొనగలిగెను.

మనభాష సహజముగా గేయరచనానుకూల మైనదే యయ్యు కొన్ని కారణములచే మన గేయవాఙ్మయశాఖ పూర్వకాలమున తగిన మన్నన పొందలేదు. ఆ వాఙ్మయనిర్మాతలలో ప్రథమబ్రహ్మ యని పేర్కొనదగిన తాళ్లపాక అన్నమాచార్యుని పేరైనను నిన్నమొన్నటివరకు ఆంధ్రులు వినియెఱుగరు. ఆంధ్రజయదేవు డనదగిన క్షేత్రయ్యపదములు తెనుగుదేశమునుండియు సాహితీక్షేత్రమునుండియు తరిమివేయబడినవి. త్యాగబ్రహ్మనామము విస్మృతముకాకుండుటకు గాయకులుమాత్రమే కారణముగాని సాహితీపరులు కాదు. గేయకవితాపుంభావసరస్వతు లనదగిన పైని పేర్కొన్న ముప్వురి చరిత్రయే ఇటులుండగా తక్కిన చిల్లరమల్లరకీర్తనలు వ్రాసినవారి సంగతి తడవనేల? గేయకవిత్వములో ఒక నిసర్గలోప మున్నది. అది పాటవలనగాక పఠనమువలన వ్యాప్తికి రాదు. పాడగలవారు కొరవడినంతనే పాటవలన వచ్చిన వ్యాప్తియు మరుగుపడిపోవును. కాని గేయములో గానాంశను వదలి కవిత్వాంశను

పరిశీలనజేసి ఆ పదార్థము సుసంపన్నముగా నున్నయెడ సాహితీ విమర్శకులు దానిని వాఙ్మయకక్ష్యకు స్వీకరించుట ధర్మము. ఇది వాఙ్మయచరిత్రకారులయు విమర్శకులయు విధి.

మన ప్రాచీనగేయకవితాశాఖను గూర్చి సవిమర్శ వాఙ్మయచరిత్ర రచింపవలసిన ఆవశ్యకత యెంతేని కలదు. ఆ శాఖలో ప్రబంధకవులకుగూడ వరవడి పెట్టిన భావసంపదయు నుడికారముపొంకమును మెండుకొనియున్నవి.

అట్టి భావసంపన్నతను అట్టి నుడికారపుసొగసులను ప్రదర్శించి ఉత్తమకవులుగా పరిగణింపబడిన గేయరచయితలు ఈనాడును కొందరు కలరు. వారిలో ఈ రజనీకాంతరావు ఒకడు. ఇతడు ఉత్తమశ్రేణికి చెందిన గేయకవి. శాస్త్రీయమైన రాగ తాళ జ్ఞానముతో స్వయముగా పాడనేర్చిన గానకళా నిపుణు డగుటనుబట్టి వాగ్గేయకారు డనిపించుకొనిన విశేష ప్రజ్ఞాశాలి.

పూర్వులు ఒక్కొక్క కీర్తనసంపుటికి శృంగారపదము లనియు, భక్తికీర్తన లనియు, తత్త్వము లనియు, తత్తత్ కీర్తన సముదాయములోని గుణప్రాధాన్యమునుబట్టి స్థూలముగా నామనిర్దేశము చేయుచుండెడివారు. ఆ సంప్రదాయమునే పాటించి ఈ 'శతపత్రసుందరి'కి ప్రణయకీర్తన లని నామకరణ మొనర్చుట సముచిత మని నా ఉద్దేశము. ఇందు దేశభక్తి ప్రబోధకములు, దేశమాతృస్తవములు, దేశనాయకప్రశంసలు

మొదలైన రాజకీయకీర్తనలును మరి యితరములును కొన్ని యున్నను తక్కిన అనేకములు వ్యస్తములును నాటికాగీత ములునుగూడ ప్రణయభావపూరితము లగుటచేత నేను ఈ సంపుటికి ఆ వ్యపదేశము బాగని తలంచితిని.

ప్రణయము శృంగారముకంటె కొంత భిన్నము. ఆలం కారికసిద్ధాంతమునుబట్టి శృంగారమునకు 'రతి' స్థాయి యగును. ప్రణయమునకు ప్రేమ స్థాయి. దీనిని ప్రేయస్సు అనియు చెప్ప వచ్చును.

ఈ "ప్రేమ లేకున్న లోకాన ఏమున్నది?" అని యీ కవి ప్రశ్న. నిజమే ప్రేమలేని ప్రపంచము శూన్యమే నని నా యొప్పుదల. మరియు,

"ప్రేమ నాలో పెరిగి పెద్దదౌతుంటేను
నేను భగవంతునికి చేరువౌతుంటాను"

అని ఇతని స్వానుభవప్రవచనము. (చూ. 308 పుట.) ఇది ఆధ్యాత్మికసత్యములలో ఒకటి. హృదయము ప్రేమావిష్ట మైనప్పుడే ఆత్మ భగవంతుని పాదసన్నిధానమున వ్రాలు నని భక్తియోగు లుపదేశించు తత్వము.

ఈ ప్రేయస్సు అనునది శృంగారములో అంతర్భాగమే అని వాదించెడి ఒక ఆలంకారికమతము కలదు. అందు కొంత సత్యము లేకపోలేదు. కాని శృంగార మనగా నాయికానాయక

ఆలంబనసముత్పన్నము మాత్రమే యని అంగీకరింతుమేని ప్రణయము దానికంటె భిన్నమని వెంటనే అంగీకరింపవలెను. ఈ ప్రేయస్సునకు ఆలంబనము నాయికానాయకరూప స్త్రీపురుషులే కానక్కరలేదు. పరస్పర భావానుబంధముగల యే రెండుజీవులైనను కావచ్చును. ఆత్మయొక్క సర్వగతత్వమును అంగీకరింతుమేని అచేతనములైన ఏరెండు మూర్తులైనను ఈ ప్రేయస్సుకు ఆలంబనము కావచ్చును.

మబ్బు యువతిగా మలయపవనుడు యువకుడుగా పరస్పరానురాగబద్ధచేతసములై వలపుసొలపుల తీయదనములు కలసి ఆరగింపవచ్చును. ప్రేమికుడౌ చంద్రుడు, ప్రేయసియౌ తారకు చేసన్న చేసి చంద్రనౌకలో ఎక్కించుకొని వెన్నెలవెల్లువలో విహరింపవచ్చును. (చూ. ౧౭౦, ౧౭౩. పుటలు.)

ప్రకృతికి ప్రసవధర్మిణి యనెడి ఇంకొక పేరు గలదు. విశ్వలీల ప్రణయమూలకము అను న్యాయమునుబట్టియే ఆ పేరు సమర్థింపబడును. విశ్వప్రవృత్తి ప్రణయ లీల యగుచో చేతనాచేతనపదార్థజాత మంతయు మాధుర్యప్రవాహమగ్నమే. ఆ దర్శనము లభించిన కవికి 'అంధకారప్రభలు మందువైపులను' 'వల్లకాటిదయ్యాల చెరలాటలోను' అన్నివైపులగూడ ఊరకే మాధురులు ఊరిపోవుచుంటవి. (చూ. పుట. ౨౦.)

సుఖదుఃఖమయమైన ప్రాపంచికజీవితసముద్రమున పొడమెడి అమృతమునేకాక విషమునుగూడ మధురముగానే

భావింపగల జీవికి వేరే యోగసాధనాదుల యక్కర యుండదు. ఈకవి లోకమునకు చేయు ప్రబోధము "ఎల్లెడల మాధురులు గ్రోలుడు" అని. అసలు నే నెరిగినంతవరకు ఇతని చిత్తవృత్తియే మాధురీభరితము, కటుత్వపారుష్యాదు లిత డెఱుగడు. అట్టి చిత్తమున మొలకెత్తిన మధురభావములే యీ గేయార్థములు.

రజనీకాంతరావు పద్యకవిత్వము వ్రాయ లేనికవి కాడు. ఇతడు రచించిన పద్యకవిత్వము ఇందు ప్రకటింపబడకపోయినను బహుళముగా కలదు. ఆ పద్యములలో ఈతని గీతపద్యపునడక ఇతని తండ్రిగారి గీతపద్యమునే అనుసరించి సాగుచుండు నని నా ఊహ. ఇందలి నాందీముఖములోని,

"జగతి రంగస్థలమ్ముగా సకలజీవ
తతులు పాత్రలుగాగ గాథలను గూర్చి
వెలుగునీడల తెరవెన్క నిలుచు నటన
సూత్రధారుండు మమ్ము బ్రోచుత సతమ్ము"

అనెడి గీతపద్యము నాచిన్ననాడు చదివిన వేంకటపార్వతీశ్వరుల గీతపద్యములను జ్ఞప్తికి తెచ్చినది.

ఇట్టి నానాసాధనసామగ్రి గల యీ నా శిష్యుడు ఒక పద్యప్రబంధమునుగూడ రచించి ఆంధ్రుల కర్పించుగాక!

ఇతని కవితాయశము దినదినప్రవర్ధమానమై అజరామర ముగా వెలుగొందుగాక.

"పసిడి మెరుంగుల తళతళలు" అనెడి తెలుగుతల్లి గేయము (చూ. ౭.) ఆంధ్రరాష్ట్రావతరణముహూర్తమున ఆంధ్రమాతకు మన మర్పించు ఆవాహనోపచారమై మన జాతీయగీతముగా స్థిరపడుగాక!

తుది రెండు గేయములలోని మంగళము (చూ. ౩౭౭.) తెలుగుతల్లికి మనము చేయు నిత్యపూజలో నీరాజనోపచారమగుగాక!

మకాం: మద్రాస్
ది. ౨౭-౩-౫౩.

పింగళి లక్ష్మీకాంతం.

# ధన్యవాదము

(14-12-53 తేదీన విజయవాడలో జరిగిన
తెలుగుభాషాసమితివారి
బహుమతి ప్రదానోత్సవసమయమున పాడినగేయము.)

నే మాటకారిని గాను సభలను
మరియు నేరనివాడనై,
నా పాటలల్లే ప్రజ్ఞకై బహు
మాన మందినవాడనై

నే పాడుదును గళమెత్తి, స్థాయులు
మూడు పైపై హెచ్చగా
రాగమ్ము తీగలుసాగ, శ్రోతలు
బాగు బాగని మెచ్చగా!! నేపాడుదును!

కవిరాజహంసగురుప్రసాదము
కవనమై ఫలియించగా,
ఆకాశవాణీసేవలో నా
గానధోరణి మించగా! నేపాడుదును!

శతపత్ర సుందర కావ్యకన్యక
సమితిమన్నన లందగా,
సహజన్మిమాన్యుల సత్కృతుల సహా
సన్నుతుల నే పొందగా!! నేపాడుదును!

స్వాతంత్ర్యవిభవామోదమోహిత
  తల్లి భారతి పొంగులో,
అభ్యుదిత రాష్ట్రానందవర్ధిత
అమ్మ ఆంధ్రి వెలుంగులో!! నేపాడుదును!

సన్మానములు సద్యత్నముల ప్రో
త్సాహకములని తెలియగా
ఉత్సవసమాగత జనశుభాశీ
రక్షయాంక్షత లాలయగా!! నేపాడుదును!

నే పాడుదును గళమెత్తి స్థాయులు
  మూడు పైపై హెచ్చగా,
రాగమ్ము తీగలుసాగ, శ్రోతలు
బాగుబాగని మెచ్చగా!! నేపాడుదును!!

# విషయసూచిక

## వసంతపత్రావళి


| గేయము. | | తొలిపంక్తి | రచనాకాలము. | పుట. |
|---|---|---|---|---|
| ౧ ఉగాది | ... | ఆలయమున | ౧౯౩౭ | 3 |
| ౨ నాందీముఖము | ... | జీవితమ్మను | ౧౯౩౬ | 4 |
| ౩ నాదేవుఁడు | ... | నాదేవుని | ౧౯౩౬ | 5 |
| ౪ తెలుగుతల్లీ | ... | పసిడిమెఱుంగుల | ౧౯౩౯ | 7 |
| ౫ శతపత్రసుందరి | ... | శతపత్రసుందరి | ౧౯౪౧ | 9 |
| ౬ విశ్వవీణ | ... | విశ్వవీణారవ | ౧౯౩౭ | 11 |
| ౭ కోయిలా | ... | పాడవే కోయిలా | ౧౯౩౮ | 13 |
| ౮ చిన్నిపూవు | ... | చేకొనవె | ౧౯౩౮ | 15 |
| ౯ మధుపాయి | ... | మధుపాయి | ౧౯౩౮ | 17 |
| ౧౦ మాధురులు | ... | ఊరకే మాధురులు | ౧౯౩౮ | 20 |
| ౧౧ ఒక్కపువ్వే | ... | ఒక్కపువ్వేటు | ౧౯౩౮ | 23 |
| ౧౨ చండీదాసు ప్రేమగీతి | ... | అతిదీనకామిని | ౧౯౩౮ | 26 |
| ౧౩. కన్నెకాకిబావ | ... | కాకిచూపుల | ౧౯౩౮ | 28 |
| ౧౪ ప్రధానం | ... | ఎన్నితీయనికలలు | ౧౯౩౮ | 30 |
| ౧౫ మనప్రేమ | ... | మనప్రేమ | ౧౯౩౮ | 32 |
| ౧౬ వలపులో | ... | వలపులో | ౧౯౩౮ | 34 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము, పుట. | | |
|---|---|---|---|---|
| ౧౭ వసంతోత్సవము | ... | పులుగుపెచ్చెలులార | ౧౯౪౧ | 35 |
| ౧౮ మధువసస్వప్నగీతం | ... | మధువనీలకాంత | ౧౯౪౪ | 37 |
| ౧౯ మలయానిలుడు ౧ | ... | రావోయీ | ౧౯౪౪ | ,, |
| ౨౦ మలయానిలుఁడు ౨ | ... | ఏతెంచెనదె | ౧౯౪౪ | 38 |
| ౨౧ మరులుమాతంగి ౧ | ... | చరచరచర | ౧౯౪౪ | 38 |
| ౨౨ ,, ,, ౨ | ... | మరులుమాతంగిపూదేనె | ౧౯౪౪ | 39 |
| ౨౩ జోల | ... | జోజో జోజో | ౧౯౪౪ | ,, |
| ౨౪ మాయాజాలం | ... | రేగనీ | ౧౯౪౪ | 40 |
| ౨౫ మధువసస్వప్నసీమ | ... | ,, | ౧౯౪౪ | ,, |
| ౨౬ వెలుగు | ... | వెలుగు | ౧౯౪౦ | 41 |
| ౨౭ పెళ్లికాకముందు | ... | ఏమని | ౧౯౪౭ | 42 |
| ౨౮ పెళ్లయాక | ... | చిన్నసాటి | ౧౯౪౭ | 43 |
| ౨౯ ఇంట ఊయల | ... | ఊయలఊపనా | ౧౯౪౭ | 44 |
| ౩౦ ఆరుబుతువులఊయెల | ... | జీవితముయ్యాలగా | ౧౯౪౭ | 45 |
| ౩౧ పూలచెండు | ... | అందుకోండి | ౧౯౪౧ | 48 |
| ౩౨ మేలుకొలుపు | ... | మేలుకొలిపెగా | ౧౯౫౧ | 49 |
| ౩౩ మలయానిలుడు-విరిసెన | ... | ఓ మలయపవనమా | ౧౯౫౧ | 50 |
| ౩౪ స్వభాను | ... | రావేరావే | ౧౯౪౩ | 52 |
| ౩౫ మధుబుతువు | ... | వెలసెనహో | ౧౯౪౫ | 53 |
| ౩౬ చెల్లికి | ... | మెరసె మెరసె | ౧౯౩౮ | 54 |
| ౩౭ వసంతము | ... | జగతికి వసంతమా | ౧౯౪౮ | 55 |

## గ్రీష్మపత్రావళి


| గేయము. | | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|---|
| ౩౮ అందవు | | ... | అందవు అందవు | ౧౯౪౦ | 59 |
| ౩౯ గతాగతం | | ... | చూచిన కొలంది | ౧౯౪౧ | 60 |
| ౪౦ వికృతహాసం | | ... | హృదిపొంగే | ౧౯౪౧ | 61 |
| ౪౧ గజల్ | | ... | హాయిలో | ౧౯౪౫ | 62 |
| ౪౨ విరహిణి | | ... | విరహానలంపుబాధ | ౧౯౩౯ | 63 |

### గ్రీష్మనాటికాగీతాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౪౩ స్వాగతము | | ... | సంధ్యారుణిమా | ౧౯౪౬ | 64 |
| ౪౪ గ్రీష్మజృంభణము | ౧ | ... | నడిమింట | ౧౯౪౧ | 65 |
| ౪౫ " " | ౨ | ... | ఈరేడుజగాలు | ౧౯౪౧ | " |
| ౪౬ " " | ౩ | ... | ఎండకాదు | ౧౯౪౧ | 66 |
| ౪౭ తోటమాలి | ౧ | ... | తోటమాలీ | ౧౯౪౧ | 67 |
| ౪౮ " | ౨ | ... | ఓసారిలెమ్ము | ౧౯౪౧ | 68 |
| ౪౯ " | ౩ | ... | తోటమాలిజోలి | ౧౯౪౧ | 69 |
| ౫౦ చలిపందిరి | | ... | విరిచెలువలార | ౧౯౪౧ | 70 |
| ౫౧ వీడ్కోలు | | ... | తీయమావిచివుళ్ల | ౧౯౪౧ | 72 |
| ౫౨ ఆశాగీత | | ... | కనవో | ౧౯౪౧ | 74 |
| ౫౩ గ్రీష్మసంధ్య | | ... | మెరసినవి వినువీథి | ౧౯౪౧ | 75 |

---

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౫౪ యక్షుని గ్రీష్మము | | ... | నీకుమాత్రము | ౧౯౪౧ | 76 |
| ౫౫ ఏలో ఏలేలే | | ... | ఏలో కోయిల | ౧౯౫౦ | 77 |

## వర్ణపత్రావళి


| గేయము. | | తొలిపంక్తి – రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౫౬ క్రొత్తపాంగు | ... | మొయిలు నడకల | ౧౯౩౯ | 81 |
| ౫౭ శుక్తివిరహము | ... | ఈవిదాహమెటు | ౧౯౪౨ | 84 |
| ౫౮ శుక్తిముక్తాఫలము | ... | మెరపుతీవలవిగో | ౧౯౪౨ | 86 |
| ౫౯ నెమలి | ... | ఆడుతోంది నెమలి | ౧౯౪౨ | 87 |
| ౬౦ హరివిల్లు | ... | అదిగో లేచెను | ౧౯౪౨ | 88 |
| ౬౧ చినుకుపాట | ... | చినుకు కన్నియల | ,, | 90 |
| ౬౨ శ్రావణలక్ష్మి | ... | శ్రావణలక్ష్మి | ,, | 91 |
| ౬౩ ములగసిర | ... | వొచ్చిందా తిరిగీ | ,, | 93 |
| ౬౪ చాతకీ | ... | నీదుపాటవిందుకే | ,, | 94 |
| ౬౫ వానకోయిల | ... | చిటపట | ,, | 95 |
| ౬౬ మయూరీ | ... | నటనమాడవే | ౧౯౫౨ | 96 |
| ౬౭ ఇంద్రధనుస్సు | ... | నింగి నేలకు | ౧౯౫౦ | 98 |
| ౬౮ అభిసారిక | ... | గాలివాన రేయి | ౧౯౪౨ | 99 |
| ౬౯ జలదాగమనం | ... | మురళీధరుని | ౧౯౪౧ | 100 |
| ౭౦ మేఘమా | ... | మేఘమా | ౧౯౪౨ | 102 |
| ౭౧ దిగకోయిలా | ... | మెరిసేమబ్బుల | ౧౯౪౧ | 103 |
| ౭౨ ఉజ్జయిని పిలుపు | ... | రమ్మోయిజలధరా | ౧౯౪౧ | 104 |
| ౭౩ అలకానగరి | ... | ప్రణయజీవనపు | ౧౯౪౧ | 105 |
| ౭౪ మేఘరంజని ౧ | ... | ఘనాఘనా | ౧౯౪౫ | 107 |
| ౭౫ ... ౨ | ... | హేదయాంభోధరా | ౧౯౪౮ | 109 |
| ౭౬ వరలక్ష్మి | ... | స్వాగతమమ్మా | ౧౯౪౪ | 110 |
| ౭౭ వొల | ... | ఔయ్యారా వొల | ౧౯౪౨ | 111 |

| | గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|---|
| ౪౮ | అభిసరణ | ... | సఖునిగాంతునే | ౧౯౪౬ | 112 |
| ౪౯ | కృష్ణజననము | ... | భువననేత | ౧౯౪౫ | 113 |
| ౫౦ | అవతారము | ... | అలవైకుంఠపురం | ౧౯౫౧ | 115 |


## దివ్యజ్యోతి నాటకగీతాలు


| | | | | | |
|---|---|---|---|---|---|
| ౫౧ | వైతాళికగీతులు | ... | మేలుకో | ౧౯౪౧ | 119 |
| ౫౨ | మాయాదేవిస్వప్నం ౧ | ... | నిద్రాముద్రితవు | ,, | 120 |
| ౫౩ | ,, ,, ౨ | ... | విహరింపవె | ,, | ,, |
| ౫౪ | ,, ,, ౩ | ... | చైత్రజీవ | ,, | 122 |
| ౫౫ | ,, ,, ౪ | ... | మెరయుదిశాముఖ | ,, | 123 |
| ౫౬ | గౌతమబుద్ధునిజననం | ... | ప్రమదావని | ,, | 124 |
| ౫౭ | అసితముని ఆవేదన | ... | అసదృశతేజోవర్తి | ,, | 126 |
| ౫౮ | ఏనాడో యేనాడో | ... | ఈనాడెకాదు | ,, | 127 |
| ౫౯ | స్వయంవరం | ... | కామదేవు కొలువు | ,, | 128 |
| ౬౦ | సోమరి పాట | ... | అమనిపొంగులో | ,, | 129 |
| ౬౧ | భ్రమరప్రబోధం | ... | భ్రమరా భ్రమరా | ,, | 131 |
| ౬౨ | చితిజ్వాల | ... | రగిలిమండెను | ౧౯౪౧ | 133 |
| ౬౩ | ఉజ్జ్వలప్రభాతము | ... | అమలహృదయ | ,, | 134 |
| ౬౪ | ప్రస్థానము | ... | ఈయురులు | ,, | 135 |
| ౬౫ | వియోగిని | ... | హృదయేశ్వరుడు | ,, | 137 |
| ౬౬ | వైతాళికగీతి | ... | పాలపుంత | ,, | 138 |
| ౬౭ | విరాగగీతము ౧ | ... | శ్రుతులు సమముగా | ,, | 139 |
| ౬౮ | విరాగగీతము ౨ | ... | గడ్డిపువ్వు సుఖము | ,, | 140 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | పుట. |
|---|---|---|---|
| ౯౯ బోధిమహీజము | ... | ఆశాంతర ౧౯౪౧ | 141 |
| ౧౦౦ ఒక్కడవే | ... | ఒకరయినా ౧౯౪౮ | 142 |

## శరత్పత్రావళి


| | | | |
|---|---|---|---|
| ౧౦౧ పరిక్రమణ | ... | చల్లగాలిలో ౧౯౪౧ | 147 |
| ౧౦౨ విభావరి | ... | ఓ విభావరి ౧౯౪౨ | 148 |
| ౧౦౩ నళిని - పవనుడు | ... | కుంజవని ౧౯౪౨ | 149 |
| ౧౦౪ శరద్గీతి | ... | పసిడిమబ్బుల ౧౯౪౨ | 150 |
| ౧౦౫ సంధ్యాదీపకళిక | ... | స్వామినీయాలయమున ౧౯౪౧ | 151 |
| ౧౦౬ స్వప్నజగతి | ... | స్వప్నజగతిలో ౧౯౫౭ | 153 |
| ౧౦౭ జాజి - తుమ్మెద | ... | చల్లగాలిలో పూల -తోటలో ౧౯౪౨ | 154 |


## శతపత్రసుందరినాటికాగేయాలు


| | | | |
|---|---|---|---|
| ౧౦౮ ఆశ్వాసనము | ... | శతపత్రసుందరీ ౧౯౪౨ | 155 |
| ౧౦౯ అస్తమయము | ... | ఇనుడుకొండదిగెనా ౧౯౪౨ | 156 |
| ౧౧౦ కీచురాలు | ... | హాయి హాయి ౧౯౪౨ | 157 |
| ౧౧౧ విరహిణి | ... | తిరిగి తిరిగి తిరిగి ౧౯౪౨ | 158 |
| ౧౧౨ చంద్రోదయము | ... | జాబిల్లివస్తున్నాడు ౧౯౪౨ | 159 |
| ౧౧౩ జోల | ... | జోజో సఖి ౧౯౪౨ | 160 |
| ౧౧౪ స్వప్నలోకము | ... | స్వప్నలోకము ౧౯౪౨ | 161 |
| ౧౧౫ గగనయానము | ... | సరసిఁడిచి ౧౯౪౨ | 162 |
| ౧౧౬ మేలుకొనవె | ... | మేలుకొనవెశతపత్రా ౧౯౪౨ | 163 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౧౧౭ రోద | ... | రోదసేయకె | ౧౯౪౨ | 164 |
| ౧౧౮ కొండకోన | ... | కొండకోనలో | ,, | 165 |
| ౧౧౯ సెలయేరు | ... | రా సెలయేరా | ,, | 166 |
| ౧౨౦ ప్రతిశ్రుతి | ... | ఓహో ప్రతిశ్రుతీ | ,, | 167 |
| ౧౨౧ బృందావనము | ... | కోపమేలరాధా | ౧౯౪౧ | 168 |
| ౧౨౨ వెన్నెలరేయి | ... | కన్నులకింపౌ | ౧౯౪౧ | 170 |
| ౧౨౩ మబ్బుకన్నె—మలయానిలుడు | ... | మలయపవన | ౧౯౪౧ | 173 |
| ౧౨౪ దినాంతము | ... | దినాంతమ్ము | ౧౯౪౨ | 176 |
| ౧౨౫ అన్వేషణ | ... | యమునాతీర | ౧౯౪౨ | 177 |
| ౧౨౬ మనమిద్దరమే | ... | ఇద్దరమే | ౧౯౫౦ | 178 |
| ౧౨౭ ఎందుకో | ... | ఎందుకో పున్నమ | ౧౯౪౮ | 180 |
| ౧౨౮ మెట్లపరుసలు | ... | మెట్లపరుసలు | ౧౯౪౮ | 182 |
| ౧౨౯ జ్వాలాతోరణం | ... | జ్వాలాతోరణం | ౧౯౪౩ | 183 |
| ౧౩౦ దిబ్బ్యాదిబ్బ్యా | ... | దిబ్బ్యా దిబ్బ్యా | ౧౯౪౩ | 183 |
| ౧౩౧ కనుడదే | ... | కనుడదే | ౧౯౪౩ | ,, |
| ౧౩౨ చైత్రయాత్ర | ... | కేలకేలగోగు | ౧౯౪౩ | 185 |
| ౧౩౩ ప్రతిజ్ఞ | ... | ప్రతిహస్తము | ౧౯౫౧ | 187 |
| ౧౩౩ దీపావళి | ... | ఇంటింటి ముంగిటా | ౧౯౫౧ | 188 |


## అవంతిసుందరి నాటికా గేయాలు


| | | | | |
|---|---|---|---|---|
| ౧౩౫ మన్మథోత్సవం | ... | అంజలిదే | ౧౯౪౫ | 189 |
| ౧౩౬ రాజహంసమా | ... | రావో రాజహంసమా | ౧౯౪౫ | 190 |
| ౧౩౭ ఇంద్రజాలము ౧ | ... | రావోయివైనతేయా | ౧౯౪౫ | 191 |
| ౧౩౮ ఇంద్రజాలము ౨ | ... | దిగుదిగుమహేంద్రజాలీ | ౧౯౪౫ | ,, |

## కడలిదరి పాటలు


| గేయము. | | తొలిపంక్తి | రచనాకాలము. | పుట. |
|---|---|---|---|---|
| ౧౩౯ రమ్యాణివీక్ష్య | ... | స్మరియింతురుగా | ౧౯౪౫ | 192 |
| ౧౪౦ తొలిపిలుపు | ... | ఎవరుపిలిచినారో | ౧౯౪౧ | 193 |
| ౧౪౧ ప్రియోక్తి | ... | సడలనీకు | ౧౯౪౧ | 194 |
| ౧౪౨ చెలివలపు | ... | తీయతీయగా | ౧౯౪౧ | 195 |
| ౧౪౩ చెలిసొగసు, వలపు | ... | తెలియునా | ౧౯౪౧ | 196 |
| ౧౪౪ వాగ్భంగము | ... | ఇటులౌనని | ౧౯౪౧ | 197 |
| ౧౪౫ కావేరి | ... | కావేరి ఓ కావేరి | ౧౯౪౧ | 198 |


## మాళవిక పాటలు


| | | | | |
|---|---|---|---|---|
| ౧౪౬ సుమసౌరభము | ... | ఈసుమసౌరభము | ౧౯౪౬ | 200 |
| ౧౪౭ ఏకాంత జీవిక | ... | ఎదగాయపడి | ౧౯౩౮ | 201 |
| ౧౪౮ నాట్యపరీక్ష | ... | నర్తించునవె | ౧౯౪౬ | 202 |
| ౧౪౯ ఎందుకో | ... | ఎందుకోహృదయమా | ౧౯౪౬ | 203 |
| ౧౫౦ లాక్షాచిత్రణ | ... | కదలకుమా | ౧౯౪౬ | 204 |
| ౧౫౧ దోహదము | ... | పరపుము | ౧౯౪౬ | 205 |
| ౧౫౨ ఎడబాపు | ... | మనోరమణుడె | ౧౯౪౬ | 206 |
| ౧౫౨ అశోకదోహదము | ... | ఎత్తైనదే మాళవిక | ౧౯౪౬ | 207 |
| ౧౫౪ కుసుమితాశోకము | ... | విరహాశిశిరమరిగె | ౧౯౪౬ | 208 |
| ౧౫౫ ఓ శశీ | ... | ఓ శశీ | ౧౯౪౬ | 209 |
| ౧౫౬ కలువా | ... | కలువా | ౧౯౪౬ | 210 |
| ౧౫౭ ఆనందప్రకృతి | ... | ఆకుపచ్చని ఆకు | ౧౯౪౫ | 211 |
| ౧౫౮ స్వేచ్ఛ | ... | పాట తెలిసిన | ౧౯౪౧ | 212 |
| ౧౫౯ శరదభిసారిక | ... | మధువనికానరావో | ౧౮౪౧ | 214 |

| గేయము. | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|
| ౧౬౦ హృదయనావ | చిన్నదోయీ | ౧౯౪౧ | 216 |
| ౧౬౧ గులాబి | సంజనీరెండ | ౧౯౪౬ | 217 |
| ౧౬౨ చిత్రార్జునులు | ఎవరో నీవెవరో | ౧౯౪౪ | 218 |
| ౧౬౩ పరిష్వంగము | హాయిగ నాడుదుదా | ౧౯౪౧ | 219 |
| ౧౬౪ నిదురపో | నిదురపో | ౧౯౫౧ | 220 |
| ౧౬౫ మెల్లమెల్లగా | మెల్లమెల్లగా | ౧౯౫౧ | 221 |
| ౧౬౬ మధురయామిని | మధురయామిని | ౧౯౪౪ | 222 |
| **హేమంతపత్రావళి** | | | |
| ౧౬౭ చలికారు | చలికారు కౌగిలించె | ౧౯౪౭ | 225 |
| **విషవృక్షగీతాలు** | | | |
| ౧౬౮ హరిదాసకీర్తన | తన అధరసీమపై | ౧౯౫౨ | 226 |
| ౧౬౯ జూదరి వేదాంతము ౧ | వేరేజూద మెందుకు | ,, | 228 |
| ౧౭౦ జూదరి వేదాంతము ౨ | చూపుదూర మెందుకు | ౧౯౫౨ | 230 |
| ౧౭౧ కాలసర్పి | ఆడుదంటే | ౧౯౫౨ | 232 |
| **ఉమర్ ఖైయామ్ పాటలు** | | | |
| ౧౭౨ అనుభవ భావము | ఎన్నో ఎన్నో ఫలాల్ | ౧౯౪౬ | 233 |
| ౧౭౩ ఖైయాముతత్వం | ఖైయాముతో కలసి | ,, | 235 |
| ౧౭౪ హేమంతగానము | మట్టిబొమ్మలను | ,, | 236 |
| ౧౭౫ కారవాన్ | సాకిరావె సాకీ | ,, | 237 |
| ౧౭౬ కలలబేహారి ౧ | కలలూబాబూ | ,, | 239 |
| ౧౭౭ ,, ౨ | కలలు కొంటారా | ,, | 240 |
| ౧౭౮ మధుమాయ | మోయవె మధుమురళి | ౧౯౪౩ | 242 |

## కడలివరి పాటలు


| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౧౩౯ రమ్యాణివీక్ష్య | ... | స్మరియింతురుగా | ౧౯౪౫ | 192 |
| ౧౪౦ తొలిపిలుపు | ... | ఎవరుపిలిచినారో | ౧౯౪౧ | 193 |
| ౧౪౧ ప్రియోక్తి | ... | సడలనీకు | ౧౯౪౧ | 194 |
| ౧౪౨ చెలివలపు | ... | తీయతీయగా | ౧౯౪౧ | 195 |
| ౧౪౩ చెలిసొగసు, వలపు | ... | తెలియునా | ౧౯౪౧ | 196 |
| ౧౪౪ వాగ్భంగము | ... | ఇటులౌనని | ౧౯౪౧ | 197 |
| ౧౪౫ కావేరి | ... | కావేరి ఓ కావేరి | ౧౯౪౧ | 198 |


## మాళవిక పాటలు


| | | | | |
|---|---|---|---|---|
| ౧౪౬ సుమసౌరభము | ... | ఈసుమసౌరభము | ౧౯౪౬ | 200 |
| ౧౪౭ ఏకాంత జీవిక | ... | ఎదగాయపడి | ౧౯౩౮ | 201 |
| ౧౪౮ నాట్యపరీక్ష | ... | నర్తించునవె | ౧౯౪౬ | 202 |
| ౧౪౯ ఎందుకో | ... | ఎందుకోహృదయమా | ౧౯౪౬ | 203 |
| ౧౫౦ లాక్షాచిత్రణ | ... | కదలకుమా | ౧౯౪౬ | 204 |
| ౧౫౧ దోహదము | ... | పరపుము | ౧౯౪౬ | 205 |
| ౧౫౨ ఎడబాపు | ... | మనోరమణుడె | ౧౯౪౬ | 206 |
| ౧౫౩ అశోకదోహదము | ... | ఎత్తినదే మాళవిక | ౧౯౪౬ | 207 |
| ౧౫౪ కుసుమితాశోకము | ... | విరహాశిశిరమరిగె | ౧౯౪౬ | 208 |


---


| | | | | |
|---|---|---|---|---|
| ౧౫౫ ఓ శశీ | ... | ఓ శశీ | ౧౯౪౬ | 209 |
| ౧౫౬ కలువా | ... | కలువా | ౧౯౪౬ | 210 |
| ౧౫౭ అనందప్రకృతి | ... | ఆకుపచ్చని ఆకు | ౧౯౪౫ | 211 |
| ౧౫౮ స్వేచ్ఛ | ... | పాట తెలిసిన | ౧౯౪౧ | 212 |
| ౧౫౯ శరదభిసారిక | ... | మధువనికానరావో | ౧౯౪౧ | 214 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౧౬౦ హృదయనావ | ... | చిన్నదోయీ | ౧౯౪౧ | 216 |
| ౧౬౧ గులాబి | ... | సంజనీరెండ | ౧౯౪౬ | 217 |
| ౧౬౨ చిత్రార్జునులు | ... | ఎవరో నీవెవరో | ౧౯౪౪ | 218 |
| ౧౬౩ పరిష్వంగము | ... | హాయిగ నాడుదుదా | ౧౯౪౧ | 219 |
| ౧౬౪ నిదురపో | ... | నిదురపో | ౧౯౫౧ | 220 |
| ౧౬౫ మెల్లమెల్లగా | ... | మెల్లమెల్లగా | ౧౯౫౧ | 221 |
| ౧౬౬ మధురయామిని | ... | మధురయామిని | ౧౯౪౪ | 222 |

## హేమంతపత్రావళి

| | | | | |
|---|---|---|---|---|
| ౧౬౭ చలికారు | ... | చలికారు కౌగిలించె | ౧౯౪౭ | 225 |

## విషవృక్షగీతాలు

| | | | | |
|---|---|---|---|---|
| ౧౬౮ హరిదాసకీర్తన | ... | తన అధరసీమపై | ౧౯౫౨ | 226 |
| ౧౬౯ జాదరి వేదాంతము ౧ | ... | వేరేజాదమెందుకు | ,, | 228 |
| ౧౭౦ జాదరి వేదాంతము ౨ | ... | చూపుదూరమెందుకు | ౧౯౫౨ | 230 |
| ౧౭౧ కాలసర్పి | ... | ఆడుదంటే | ౧౯౫౨ | 232 |

## ఉమర్ ఖైయామ్ పాటలు

| | | | | |
|---|---|---|---|---|
| ౧౭౨ అనుభవ భావము | ... | ఎన్నో ఎన్నో ఫలాల్ | ౧౯౪౬ | 233 |
| ౧౭౩ ఖైయామతత్వం | ... | ఖైయాముతో కలసి | ,, | 235 |
| ౧౭౪ హేమంతగానము | ... | మట్టిబొమ్మలను | ,, | 236 |
| ౧౭౫ కారవాన్ | ... | సాకిరావె సాకీ | ,, | 237 |

---

| | | | | |
|---|---|---|---|---|
| ౧౭౬ కలలబేహారి ౧ | ... | కలలూబాబూ | ,, | 239 |
| ౧౭౭ ,, ౨ | ... | కలలు కొంటారా | ,, | 240 |
| ౧౭౮ మధుమాయ | ... | మోగ్రియవె మధుమురళి | ౧౯౪౩ | 242 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౧౭౯ మంచు తెరల ఆసలు | ... | నునుమంచుసోనలో | ౧౯౪౯ | 243 |
| ౧౮౦ లోకాలోకం | ... | ఏలోకానికి ఆలోకం | ౧౯౪౮ | 244 |
| ౧౮౧ ప్రబోధం | ... | మేలుకొనవో | ౧౯౪౩ | 246 |
| ౧౮౨ నవోదయాశ | ... | నవోదయమెపుడో | ౧౯౪౩ | 248 |
| ౧౮౩ శాంతిశోధ | ... | నడవనిచోటెల్ల | ౧౯౪౧ | 250 |
| ౧౮౪ అన్వేషణ | ... | దారిమాపువాడె | ౧౯౪౩ | 257 |
| ౧౮౫ ఊరడింపు | ... | ఊరడిలవె నళిని | ౧౯౪౩ | 253 |
| ౧౮౬ దిగు దిగు | ... | దిగుదిగునాగా | ౧౯౫౦ | 254 |
| ౧౮౭ హింసాయ్ ఉన్మత్త | ... | ధరాతలము | ౧౯౪౮ | 256 |
| ౧౮౮ అమరగాయకుడు | ... | వృథా వ్యథిత | ౧౯౪౧ | 259 |
| ౧౮౯ స్మృతిసీమల్లో సైకిల్ | ... | గేయకారులెవరైనా | ౧౯౪౭ | 261 |
| ౧౯౦ భగ్నప్రతిమ | ... | ఎచట ఎచట | ౧౯౪౭ | 265 |
| ౧౯౧ యశోధర వ్యాకులత | ... | ఉషస్సులశాక్యపురి | ౧౯౪౭ | 267 |
| ౧౯౨ పురప్రవేశము | ... | నేడే వచ్చు | ౧౯౪౭ | 268 |
| ౧౯౩ మాంచాలాబాలచంద్రులు | ౧ | ఎన్నాళ్లకు ఎన్నాళ్లకు | ,, | 269 |
| ౧౯౪ ,, ,, | ౨ | ఎదలో కదలు | ,, | ,, |
| ౧౯౫ రుచిదేవి | ... | కృష్ణ నృపతి | ౧౯౪౩ | 271 |
| ౧౯౬ ధరిత్రీమాత | ... | ఓర్మి తాల్చుల | ౧౯౪౧ | 273 |
| ౧౯౭ రావమ్మ | ... | రావమ్మ మా తెలుగుతల్లీ | ౧౯౫౧ | 276 |


## శిశిరపత్రావళి


| | | | | |
|---|---|---|---|---|
| ౧౯౮ తృష్ణ | ... | కొండవాలులో | ౧౯౪౧ | 279 |
| ౧౯౯ నావికా | ... | ఏ తీరమనిచేరెదో | ౧౯౪౯ | 281 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౨౦౦ పోయినస్వర్గము | ... | పోయినది | ౧౯౩౮ | 283 |
| ౨౦౧ రిక్షాపాటు | ... | విస్తృతాకాశ | ౧౯౩౭ | 286 |
| ౨౦౨ కలకోసం | ... | నేనే ఆశాలేశం | ౧౯౪౧ | 288 |
| ౨౦౩ రతీవిలాపం | ... | హే ప్రాణపతీ | ౧౯౪౧ | 289 |
| ౨౦౪ చెలిమికతలు | ... | మరపుతెరల | ౧౯౩౮ | 290 |

## దేవదాస్ నాటికాగీతాలు

| | | | | |
|---|---|---|---|---|
| ౨౦౫ భగ్నహృది | ... | ఎవరోవారో | ౧౯౪౦ | 291 |
| ౨౦౬ జానపదం | ... | సేతులార | ౧౯౪౦ | 292 |
| ౨౦౭ నృత్యగీతి | ... | సఖీ సఖీ | ౧౯౪౦ | 293 |
| ౨౦౮ పదవోయి | ... | పదవోయి | ౧౯౪౦ | 294 |
| ౨౦౯ దప్పి | ... | నీటితో ఆరేది | ౧౯౪౦ | 295 |
| ౨౧౦ మరునిముసము | ... | మరునిముసము | ౧౯౪౦ | 296 |
| ౨౧౧ జీవితము | ... | జీవితము దుఃఖ | ౧౯౪౦ | 297 |
| ౨౧౨ ఏలరాడు | ... | నీలమేఘశ్యామ | ౧౯౪౦ | 298 |
| ౨౧౩ చరమగీతి | ... | మృత్యువెల్గెత్తి | ౧౯౪౦ | 299 |

## బేహులనాటికాగీతాలు

| | | | | |
|---|---|---|---|---|
| ౨౧౪ బృందగానము | ... | శంకరపద | ౧౯౪౪ | 300 |
| ౨౧౫ యుగళగీతి | ... | ఇటులిరుగవో | ౧౯౪౪ | 301 |
| ౨౧౬ కాలనాగినీ | ... | రావే కాలనాగినీ | ౧౯౪౪ | 302 |
| ౨౧౭ వియోగగీతి | ... | వినవోచనా | ౧౯౪౪ | 303 |
| ౨౧౮ నృత్యగీతి | ... | వినర్తింతునే | ౧౯౪౪ | 304 |

## లైలామజ్నూన్ గీతాలు


| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౨౧౯ నిశ్చలప్రేమ | ... | కఠినమోయి | ౧౯౪౬ | 305 |
| ౨౨౦ మహల్ | ... | మామహల్ | ,, | 306 |
| ౨౨౧ పూలబిచ్చం | ... | మంచుతెరలో | ,, | 307 |
| ౨౨౨ ప్రేమ తప్పా | ... | ప్రేమయే అపరాధమా | | 309 |
| ౨౨౩ లైలా వీడ్కోలు | ... | సెలవింక సెలవూ | ,, | 311 |
| ౨౨౪ మజ్నూన్ విలాపము | ... | గుడారమెత్తివేశారు | | 312 |
| ౨౨౫ బృందగీతి | ... | పదిలమోహరో | ,, | 313 |
| ౨౨౬ లైలా విశ్వరూపము | ... | ఎందుచూచిన | ,, | 314 |
| ౨౨౭ తుదిపాట | ... | ఎవ్వనికలియగోరుదువో | | 315 |
| ౨౨౮ సతీపరాభవం | ... | రుద్రదేవా | ౧౯౪౨ | 316 |
| ౨౨౯ అన్నపూర్ణ | ... | అన్నపూర్ణా | ౧౯౪౨ | 317 |
| ౨౩౦ హింసామత్త | ... | హింసామత్తపృథివి | ౧౯౪౨ | 319 |


## ధర్మచక్రనాటక గీతాలు


| | | | | |
|---|---|---|---|---|
| ౨౩౧ ధర్మచక్రావేదన | ... | ఆర్తియయ్యెనే | ౧౯౪౭ | 321 |
| ౨౩౨ రాజ్యశ్రీశోకగీతి | ... | జ్వాలాకీలలోరాలి | ౧౯౪౭ | 324 |
| ౨౩౩ ప్రబోధగీతి | ... | మూతపడిన | ౧౯౪౭ | 325 |
| ౨౩౪ పాపీ | ... | పాపీ ఓహో పాపీ | ౧౯౪౭ | 326 |
| ౨౩౫ ధర్మ చక్రము | ... | సాగునదే, | ౧౯౪౭ | 328 |
| ౨౩౬ గీతాంజలి | ... | ఓయిమహాత్యాగీ | ౧౯౪౮ | 329 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౨౩౭ జోత | ... | ఇదజోతా | ౧౯౪౮ | 331 |
| ౨౩౮ పుజాశీర్వములు | ... | పూజాశీర్వములు | ౧౯౪౯ | 333 |
| ౨౩౯ పృథ్వీ ప్రశంస | ... | పృథులక్ష్మాశాలినీ | ౧౯౪౧ | 335 |
| ౨౪౦ లలితాస్తుతి | ... | మాహేశ్వరీ మహాకాళీ | ౧౯౫౨ | 336 |


## నవవసంతపత్రావళి


| | | | | |
|---|---|---|---|---|
| ౨౪౧ మహోదయం | ... | మహోదయమాయె | ౧౯౪౩ | 341 |
| ౨౪౨ స్వాతంత్ర్యస్వప్నం | ... | విధురహేమంత | ౧౯౪౪ | 343 |
| ౨౪౩ స్వతంత్రభేరి | ... | మ్రోయింపుజయభేరి | ౧౯౪౭ | 346 |
| ౨౪౪ బౌద్ధభారతవసంతము | ... | నవవసంతము | ౧౯౪౮ | 348 |
| ౨౪౫ వాగమృతద | ... | అగణితశుభ | ౧౯౪౩ | 350 |
| ౨౪౬ 'ద్వారం'వారికి ఆశీఃసుమగీతి | | నీ యాశీః సుమరాశి | ౧౯౪౯ | 351 |
| ౨౪౭ యుగకర్తా | ... | కందుకూరి వీరేశలింగం | ౧౯౪౮ | 353 |
| ౨౪౮ మాతృభూమి | ... | హేమభువనమనో మోహినీ | ౧౯౪౩ | 357 |
| ౨౪౯ సరోజిని | ... | అందుకొనుమ | ౧౯౪౯ | 358 |
| ౨౫౦ అంజలి | ... | అంజలిదే | ౧౯౪౯ | 360 |
| ౨౫౧ శాంతిదూత | ... | జయజయ | ౧౯౫౦ | 362 |
| ౨౫౨ సర్వోదయం | ... | ఓ బాపూ | ,, | 363 |
| ౨౫౩ ఉగాది | ... | స్వతంత్రభారత | ౧౯౪౮ | 365 |
| ౨౫౪ స్వాతంత్ర్యఘంట | ... | స్వాతంత్ర్యశుభోదయ | ౧౯౪౯ | 367 |

| గేయము. | | తొలిపంక్తి - రచనాకాలము. | | పుట. |
|---|---|---|---|---|
| ౨౫౫ నవభారతసందేశము | ... | ఆహానవప్రభాతము | ౧౯౪౭ | 370 |
| ౨౫౬ స్వతంత్రదేశము | ... | మాదీస్వతంత్రదేశం | ౧౯౪౮ | 371 |
| ౨౫౭ ప్రబోధము | ... | జై హిందని | ౧౯౫౦ | 373 |
| ౨౫౮ అభినందనము | ... | అభినందన చందన | ౧౯౪౮ | 375 |
| ౨౫౯ తెలుగుతల్లి | ... | తెలుగుతల్లీయశః కల్పవల్లీ | ౧౯౪౬ | 376 |
| ౨౬౦ మంగళం | ... | మంగళమమ్మ ఆంధ్రావనీ | ౧౯౪౩ | 377 |


---

ఆలయమున వినబడు నదిగో !
ఆకసమున కనబడు నదిగో !
నవవర్ష పు ఘంటానినదం
నవాశాజ్యోతి !
ప్రాతయేటి పెను తమస్సులు
పాపకలితములు మనస్సులు
పటాపంచలే !
క్షుభితహృదయములపై విరిసి
విభునికరుణ జడులై కురిసె
నవవసంతమై !
శుభోదయోత్సవసమయమున
ప్రభూ యనుచు మధురరవమున
కీర్తించుడమా !

# నాందీముఖం

జీవితమ్మను పాలకడలిని
తేలు నమృతవిషాలు క్రోలుచు
పాటగాపాడుదురు కవు లిల
యందె స్వర్గము నిల్పగా!

జీవితమ్మను పాలకడలిని
తరచి తేట గ్రహించి సిద్ధాం
తములు గూర్తురు తత్వవిదు లిల
యందె స్వర్గము నిల్పగా!

జగతి రంగస్థలమ్ముగా సకలజీవ
తతులు పాత్రలుగాఁగ గాథలనుగూర్చి
వెలుగునీడల తెరవెన్క నిలుచు నటన
సూత్రధారుండు మమ్ము బ్రోచుత సతమ్ము!

# నా దేవుడు

(వచనగీతం)

నా దేవుని గనులతో వనులతో నిండిన
కొండగా జేసికొని కొలుచుకొనవలె నని నాకోరిక !
కాని నా దేవుడు పాషాణమాత్రుడేనా ?

నా దేవుని పూలతో ఆకులతో కాయలతో నిండిన
చెట్టుగా జేసికొని సేవించుకొనవలె నని నాయభిలాష !
కాని నా దేవుడు పాదపమాత్రుడేనా ?

నా దేవునికి ఱెక్కను ముక్కును పెట్టి
పక్షిగా జేసికొని పలికించుకొనవలె నని నాయూహ !
కాని నా దేవుడు ఖగమాత్రుడేనా ?

నా దేవునికి జూలును గిలును పెట్టి
హర్యక్షముగా జేసికొని ఆరాధించుకొనవలె నని నాయాస!
కాని నా దేవుడు మృగమాత్రుడేనా ?

నా దేవునికి కాళ్లు, వ్రేళ్లు, తోకయు గీకయు పెట్టి
కోతిగా జేసికొని వినోదింత మని నాతలంపు !

కాని నాదేవుడు వానరమాత్రుడేనా ?
నాదేవునికి ముక్కూ మొగమూ పెట్టి విద్యాబుద్ధీ యిచ్చి
మనుష్యునిగా జేసికొని చీనిచీనాంబరాలతో
స్వర్ణాలంకారాలతో మణికిరీటంతో
అలంకరించి అర్చించుకొనవలె నని నా అపేక్ష !
కాని నా దేవుడు నరమాత్రుడేనా ?
నాదేవుని పురుషు డని పూజింతునా ? స్త్రీ యని సేవింతునా?
సూర్యు డని చూచికొందునా? చంద్రు డని సంతోషింతునా?
నాదేవుడు నీరా ? నిప్పా ? గాలియా ? గగనమా ?

అన్నిటను అడగియున్న నాదేవుని,
అన్నిటను నిండియున్న నాదేవుని,
అన్నిపక్షములను వహించిన నాదేవుని,
అన్నిటను తిరుగాడుచున్న నాదేవుని,
అన్నిచేష్టలు చేయుచున్న నాదేవుని,
అన్నివేషములు వేయుచున్న నాదేవుని,
అన్నిటికిని అధిదేవతయైన నాదేవుని,
అన్నిటికిని అతీతుఁడైన నాదేవుని,
నే నేవిధంగా ఆరాధించుకొందునో !

# తెలుగుతల్లీ!

పసిడి మెఱుంగుల తళతళలు
పసిమి వెలుంగుల మిలమిలలు
గౌతమి కృష్ణల గలగలలు
గుడి జేగంటల గణగణలు

మెఱసి, మొరసి మించిన శుభసమయము తల్లీ!
తరళ యశోవతి! అనుపమితరాగవల్లీ!
నీవరసంతతి చేమోడ్పు లివె తెలుగుతల్లీ!

కవిపికముల సల్లాపములు
గాయక బర్హాళ్యాలాపములు
లాస్యశిక్షగ విన్యాసములు
భాస్వత్పటహ నినాదములు

విరిసి, మ్రోగి, పఱచిన శుభసమయము తల్లీ!
సరళోక్తి మధురసవతీ! కోమలవల్లీ!
నీవరసంతతి చేమోడ్పు లివె తెలుగుతల్లీ!

హాలికజన కలహాసములు
శ్రామికజన మధుహాసములు
దాస్యవిముక్త నివాసములు
స్వతంత్ర ప్రభావికాసములు

ఒలసి, మెలసి, చెలగిన శుభసమయము తల్లీ!
చరణార్పిత కోటిత్రయహృత్సుమవల్లీ!
నీవరసంతతి చేమోడ్పు లివె తెలుగు తల్లీ!

# శతపత్రసుందరి

శతపత్రసుందరీ, ఓహో శతపత్రసుందరీ !
సురభిళ భ్రాంతిలో
సుందర

నయనదళకాంతిలో
ఈ ఉదయ సాంధ్యవేళ మెరసెలే
ఈ ఉదయ సాంధ్యవేళ

నాహృదయభావ వేల విరిసెలే
నాహృదయ భావవేల

ఓ శతపత్రసుందరీ, ఓహో శతపత్రసుందరీ !
అరుణదరహాసమో
చందన

మరున్నిశ్వాసమో
నీమృదులదళశతమ్ము తెరచెలే
నీమృదులదళశతమ్ము !

నీహృదిని మధురసమ్ము పరచెలే
నీహృదిని మధురసమ్ము
శతపత్రసుందరీ, ఓహో శతపత్రసుందరీ !
అనంగవాద్యములో
యౌవన
తరంగలాస్యములో
నీమధువు మధుకరాళి మరగెలే
నీమధువు మధుకరాళి !
నీవలపు లినకరాళి కరగెలే
నీవలపు లినకరాళి !
ఓ శతపత్రసుందరీ, ఓహో శతపత్రసుందరీ!

# విశ్వవీణ

విశ్వవీణారవ విస్మృతమాధురులు
వినువీథుల ప్రసరించెన్ !
విశ్వజీవజాల మ్మావేళను
విమోహిత మ్మనిపించెన్ !

స్థలమున జలమున సమీరణమ్మున
అనలాకాశము లందే
సదా ధ్వనించుచుఁ గదలుచు ప్రాకెను
విశ్వవీణామధురవము !

నిభృతాకాశగభీరమధ్యపు
నీలిచక్ష్మ మదె పల్లవించెను !
వారిదఘోషను భైరవితానము !
వాతోన్మాదారభటినసావరి !

అంధకార భీకరరాత్రమ్మున
నవ్యభంగిమంబుల నర్తించుచు

అదిగో! ఉన్మాదిని! సౌదామిని ! !

...          ...          ...

విశ్వమోహిని! విశ్వనటి! దేవి !
విలయంకరి! అదిగో !
విపరీతావేశ నృత్తములతో
వికృతయై ప్రకృతి వెనుక నటింపగ
విపంచీ గళితగీత పరంపర
వెఱ్ఱిగా అభినయించుచున్నదో !

...          ...          ...

అనంతమగు నావీణారవమున
అఖండమగు నామృదంగజవమున
నవ్యరుచుల వర్ణము లుదయించెను
నవ్యగతుల తాళము లలరించెను !
నవ్యాశలు వికసనము చెందెను
నవ్యతేజమూ నవనవసృష్టి
నవోత్సాహ ముద్భవ మందెడినదె !

రవీంద్రకవి వాణిని అనుసరించి.

# కోయిలా!

పాడవే కోయిలా
పంచమస్వరమెత్తి
పాడవే కోయిలా!

బయల పచ్చని ప్రాకు
పాటాలకించేని!
చలన రహిత నదాన
శశియు తిలకించేని!
పాడవే పాడు
మవ్యక్తమధురరవాన
పాడవే!!

రిక్కలనె మైకాన
చొక్కించు నీపాట
రేయి హృదయము వెడలి
హాయిగా జాలిగా
చేల గట్టులు దాటి

చిని చిన్ని తెరలుగా
పాడవే కోయిలా

నాకలల పూదేని
త్రాగు తేటివి కావో
నాకవీథుల జనుచు
నన వలపులను గొనుచు
ఆకలిగ నిప్పూవలె
అంతలో మంచువలె
పాడవే కోయిలా!

పంచమస్వర మెత్తి
పాడవే కోయిలా!

# చిన్ని పూవు

చేకొనవె చేకొనవె
చిన్నిపూవో నాథ !
కన్ను విప్పేవేళ
వన్నె లొప్పేవేళ
వలపులో తలపులో
వచ్చి దరిసెన మిచ్చి
చేకొనవె !

కమ్మపుప్పొడి చింద
కనువిందు కాదేమొ
పసిమి చిందకమున్నె
మిసిమి కందకమున్నె
చేకొనవె !

తావి బరువగునేమొ
తళుకు కరువగునేమొ,

మరులు గ్రష్మకమున్నె
ఇరులు జిష్మకమున్నె
చేకొనవె !

అలరుదోయిలిలోన
తొలకు తేనియసోన
అరగాడ్పు కోనలో
ఆరునో జారునో !
చేకొనవె చేకొనవె
చిన్నిపూవో నాథ !

రవీంద్రుని గీతి ననుసరించి.

# మధుపాయి

మధుపాయి విరి జీల్చి
మధువు త్రాగకుమోయి!
కలుగగల మధురతల
కలవరింతల కలుగు
ఆశానిరాశల, అ
నారతము చిక్కువడి,
కూర్చునెగులునఁ దగిలి
కుందుటే కోరుమోయ్!
మధుపాయి!!

తీయమంటలయేట
దిక్కెఱుఁగకుండఁగా
తెఱచాపయే లేక
త్రిప్పు మాలిమి లేక
పరువంపు టోడపై

పయనంబె వలచుమోయ్ !
మధుపాయి !!

అంద మక్కు జాలేద !
హాయిఁ గనఁగారాద !
అనువు దొరకమిఁ గలుగు
ఆర్తిసౌఖ్యముచేద ?
ప్రేమ ఫలియించుటకు
ఏమార్గ మున్నదోయ్ ?
మధుపాయి !!

నలిగి రాలిన తేకు
వలపు గోల్కొవదా ?
ఎండిపోయిన యకరు
వేమి దాహాము తీర్చు ?
కలలబాధల కపుడు
కలుగునే మధురతలు ?
మధుపాయి !!

వలపు విరిగోలనిపై
వలిగాలి యలలపై

వెలిజిందు తేనెసో
నల మున్గి తేలుమోయ్!
కలనావ మెత్తి, కాం
కలిపాటు పాడుమోయ్!
మధుపాయి, విరి జీల్చి
మధువు త్రాగకుమోయి!

# మాధురులు

ఊరకే మాధురులు
ఊరిపోతున్నాయి!
ఆవైపు ఈవైపు
అని కాదు, అలముకొను
అందమే వెలుగైన
అన్నివైపులగూడ
అంధకార ప్రభలు
మంచు వైపులఁగూడ!
ఊరకే మాధురులు!!
వలపుటామనిలోన
తల యెత్తు పూల తే
నెల క్రోలి సోలు ఆ
యెలదేటి పాటలో
ఆల వల్లకాటు, ప
య్యాల చెరలాటలో!
ఊరకే మాధురులు!!

ఒక్కసారిగ నురగ
కక్కుతూ పొంగేసి
ఉరుముతూ విరిగేటి
కెరటమ్ము కేకలో
ఆ వెన్కనే మరో
అల రాక తెలుపుతూ
ఏవైపు చూచినా
ఎందుకో మాధురులు ! !
వాడిపోయిన పూల
వాసనలు కాబోవు !
క్రొత్తవాసంతికల
కోమరు లసలే కావు !
మనసు మనస్సులై కాల
మందు కల్పించితే
ఊరకే మాధురులు
ఊరిపడుతున్నాయి !
హాయి, భోగం, మనకి
ఏవైపో దాగికోని
తీయరోజులై కలుగు
తాయి ముం దెప్పుడూ

అని కమ్మవాసనలు
విరజిమ్ముతున్నాయి !!
ఆశలై అందాలరాశులై, కలిగేటి
సౌఖ్యాలపూసులై
చిరునవ్వుమోసులై
పెరుగులో విరుగులో
తరుగులో పరుగులో
ఊరకే మాధురులు
ఊరిపోతున్నాయి !

# ఒక్క పువ్వే ?

ఒక్క పువ్వేటు చాలునోయ్? నీ
కొక్క నవ్వేటు చాలునోయీ ?
వలపులోనో సొలపులోనో
కలుగు తీపియె వలయుగాదా!
అందమందే వలపుసొలపులు
అంతటా లోకమునఁ గలవోయ్ !
ఒక్క పువ్వే ?

అడుగు నిడితివి లోకమందున
హాయికొఱకే కాదటోయీ ?
అందఱకు సొత్తయినలోకము
నంద మందే కలదు హాయి !
ఒక్కపువ్వే ?

ఏకతము గూర్చుండి యూరక
యేడ్వ నెటులు సహింతువోయీ ?

పవలనక, రేయనక, యీవిధి
బాధ నెటుల భరింతువోయీ!
ఒక్క పువ్వే ?

కలడో లేడో అయిన స్వామికి
కాలమంతయు రిత్త బుచ్చుచు
ఏల యీగతి సేవచేయుట
ఎందునా పొందని శ్రమంబున
ఒక్క పువ్వే ?

ఆ 'విభుని నేర్పయినకృతు' లగు
అన్ని విరు లందమ్ము నీవా
ఆ విభుని ప్రతిమూర్తులే యగు
అన్ని పూవులు వలపు నీవా
ఒక్క పువ్వే ?

కల విరుల నన్నిటిని వలచుము
వలయుచో లోకమునె వలచుము !
కలవు తీపియు హాయి, దానవె !
బదులుకోరే స్వార్థపరతను
వదలుమోయ్ ! అనవసరమోయీ !

లేవు నీ కాశానిరాశలు,!
రాదు నీ కిక భగ్నహృదయము !
విశ్వసౌందర్యార్చకుడవై
నిత్య మానందమ్ము గ్రోలే
సత్య మగు జీవితాశయ మా
చరణమందువ నిడగదోయి !

# "చండీదాసు ప్రేమగీతి"

అతిదీనకామిని! రజకినిరామి! నా
హృదయమందిరమె తన సదనముగ వెలసినది!
లేదు తిరుగనివాడ లేదు చూడనిజాడ
లేదు చేరననీడ తన కూటికై వేడ!
అతిదీనకామిని!
రజకినిరామిని!

ఆలయంబున వెల్గు నాదేవి యటు; నాహృ
దంతరంబున వెల్గు నీదేవి యిటు సతము!
వరప్రేమగాయని!
వాసంతదాయిని!

ఆమెను నియోగించి రాచార్యు లనుకంప
మందిరాంగణము సమ్మార్జన మ్మొనరింప!
దేవీప్రసాదమ్ము తృప్తిగా భుజియింప!
అతిదీనకామిని!
రజకినిరామిని!

యౌవనభామిని! దుఃఖనిరామిని!
నిరుపమప్రేమిని! శారదయామిని!
అతిదీనకామిని! రజకినిరామి! నా
హృదయమందిరమె తన సదనముగ వెలసినది!
అతిదీనకామిని!
రజకినిరామిని!

కవిగాయకుడు 'చండి' గానమ్ములో తేట!
లేదు లే దలరామి ప్రేమ కిలలో సాటి!!

# కన్నెకాకిబావ!

కాకిచూపుల కన్నెకొలుకుల
కొత్తతీపుల చేవులు పూయగ
తేనెబుగ్గలు గుంటలడగా
తీయపాటలు పాడుతుంటే
పండ్రెండో వసంత మిట్టే
పాలు తెంచిందోయ్ !
కాకిబావా కాకిబావా
కలిగె నీ రెక్కల్లో సత్తువ
ఎగరలేవో ఏకతంగా
ఇరులు తెంచుక మింటిలోనికి
చూపులకునూ రంగునకు నే
చూడగానువ్వు కాకిబా వవి !
హాయిగా నువ్వు పాటపాడిన
కోయి లెంపు కీక?
మారుమూలల కెగిరిపోవగ
ఒక్కపా టెలుగెత్తిపాడవ్

ఒక్కమా తెలుగెత్తిపాడవే
నక్కబావని కాను లే నేను

. . .          . . .          . . .

ఎసగు విడియపుత్తోడిమ
పసిమి మించెను గదా !
అతను శంఖరవాళి
అలముకొన్నది గదా !
తీయకోరిక తేకు
తెఱచుకొన్నదిగదా !
తలయెత్తి చూచుటకు
తటపటాయించకోయ్ !
కలిసిమాటాడుటకు
కల్లోలపడకుమోయ్ !

# ప్రధానం

ఎన్ని తీయని కలలు
కన్నానో నినుగూర్చి
ఇన్నాళ్లో ఎదవిప్పి
ఎరిగింపనా చెలీ !

బ్రతుకు పందెములలో
పయిపేరు నాదిగా
తొడిగినా వొక వీర
కడియమ్ము నాచేయి !

నీ పెదవి కెంజివురు నే
పుడికిన ఫలమె చాలు
తీయగొంతుకతోడ
కోయిలై పాడుదును !

నీమనసు నామనసు
ఏక మగుటనె చాలు
లోకమ్ము దిద్దే మ
హాకవిని కాగలను !

నీ వలపు తేనియను
త్రాపిన బలమో చాలు
ఈ రేడు లోకాలు
ఏకముగ ఏలుదును !

# మన ప్రేమ

మనప్రేమ

సస్యసుందర భూములన్
ప్రభవించి ప్రభవించి
ప్రణయ తృణకాష్ఠ మగునో? ఏమో!
ప్రణయ పల్లవం బగునో ఏమో!

మనప్రేమ

కల్లోలినీతరంగములన్
పయనించి పయనించి
ప్రణయ తరణియే యగునో? ఏమో!
ప్రణయ జలరాశి యగునో? ఏమో!

మనప్రేమ

కాలగాఢాగ్నిశిఖలన్
తపియించి, తపియించి
ప్రణయ జలదాళి యగునో? ఏమో!
ప్రణయ విద్యుల్లత యగునో? ఏమో!

మనప్రేమ

దీర్ఘ ఝంఝానిలముల౯ .

ప్రసరించి, ప్రసరించి

ప్రణయ నిశ్శ్వాస మగునో ? ఏమో !

ప్రణయ మధుహాస మగునో ? ఏమో !

మనప్రేమ

సువిశాల గగన వీథులలో

విహరించి విహరించి

ప్రణయ విహగరాజంబె అగునో !

ప్రణయ భువన సామ్రాజ్య మగునో ?

# రాధ వలపు

వలపులో తేలుదునో
మఱపులో సోలుదునో
మనసులో ప్రాణేశు
మాట తీరే తోచె!

కపురంపు తునకలో
అపరంజి మొలకలో
తలపులో నానాథు
పలుకు తీరే తోచె!

విరిదేనె ముసురులో
తొలిమించు విసురులో
విరమింపకే విభుని
వేణురావమె తోచె!

ప్రణయగీతమ్ములో
ప్రణవనాదమ్ములో
రాధయే నాథునిగ
ప్రభుడె రాధగ తోచె!

# వసంతోత్సవము

బృందం:—పులుగునెచ్చెలులార పూవునెచ్చెలులార
కొమ్మతుమ్మెదలార కదలి రా రండోయి!
తీయతావులపూలతేరెక్కి ఋతురాజు
వనలక్ష్మి కై సేయ వచ్చెనే నేడు!
ఇరులు కురియగ లోక మిగురజేసినవాడు
చలిరేడు హేమంతు డరిగెనే నేడు!!
స్వాగతమోయీ! వసంతదేవా!
స్వాగతమమ్మా వనలక్ష్మీ!!

తుమ్మె:— ఝుం ఝుం ఝుం ఝుం
ఝుం ధిం ధిం ధిం
ధిమ్మని దుందుభు
లను మ్రోయింతుము!

కోయిలలు:— ఆహా ఆహా యని
జగములు మురవగ
కుహూ కుహూ కుహూ కుహూ యని తూ
ర్యారావమ్ములు సేయుదుమోయ్!

బృందం:—స్వాగతమోయీ వసంతదేవా!
స్వాగతమమ్మా వనలక్ష్మీ!!
చలిలో రాలిన మంచుముత్తెసరులు!
ఇరులను త్రోలి హసించు కమ్మవిరులు!
మరులను జిమ్మి తనియించు తేనియలు!
మలయానిల మృదుమధురాలాపములు!
కలహంసీకృతనవనవనాట్యములు!
కొనుమోయీ మాధవ మా కానుకలు!
వనలక్ష్మియె లోకప్రియావనలక్ష్మి
కొనుమోయీ మాధవ నీప్రేయసిగా!
వనలక్ష్మీ వసంతులకు పెళ్లి!
మనస్సులకు మోదమ్మగు రండి!
తమస్సులిక తొలగును లెండి!
వనలక్ష్మీ వసంతులకు పెళ్లి!!

## మధువని

మధువనీలతాంత కాంతలారా! రారే
మదభరయౌవన మధునిధులారా రారే రారే!
నీలగగనవీథులలో బారులుగా తేరి
తేలి తేలి కోమలదళముల పరచుకరారే
లోలపవన కల్లోలినిలోన తూలి తూలి
రాలుపరాగపరిమళపాళి మెరయరారే?
రావె అశోకా అరవిందా
రావే మాకందా
రావే నవమల్లీ నీలోత్పల రారే విరులారా
మధువనస్వప్న డోల
విధురహృదయ సంయోగఖేలలో
మధురప్రేమిజన మత్సరలీల
మధువన స్వప్నడోల

మలయానిలుడు ౧:

రావోయీ మలయపవనా!
తీయ తీయ్యనైన విరితావులడోలికలో రావోయీ

---

*రాబోవు ఎనిమిది మధువనస్వప్న నాటకగీతాలు.

దూరారామ భ్రమరాళీపికాళుల
హాయిగొలుపుసన్నాయీనగారాలలో రావోయీ.

మలయానిలుడు ౨:

ఏతెంచె నదె మలయానిలుడు
వీతెంచె నదె మలయానిలుడు!
హాయి హాయిగ తీయ తీయని
భావముల నెదరేపుచూ!! ఏతెంచె!!
రివ్వురివ్వున నెగురుకమ్మని
పువ్వుతేనెల రువ్వుచూ!
దవ్వుదవ్వుల పాటతేటల
వలపు బరువుల మోయుచూ!! ఏతెంచె!!

మరులుమాతంగి ౧:

చర చర చర చర పోయే
శరవేగము చాల దహో!
చరాలు మని బిరాన పోయే తటిల్ల తేల నహో!
మనోవేగమును మించిన
మలయవాయువేగ మ్మిది!
ఏడుసముద్రములా ఈరేడుసముద్రములా
చూడు దాటి కొనితెత్తును అపరూపపుసంపంగి

మరపు తెరల మాయ ముంచు ప్రసవము
మరులుమాతంగి!!

మరులుమాతంగి ౨:

మరులు మాతంగి పూజేనె! నీదు
కనుదోయి లోగొన్న యిరుల పోద్రోలిని !! మరులు!!

ప్రియురాలి ప్రేమార్తి గనవో నీదు
హృదయమ్మురాయైతె ఇక కరగిపోయీని!! మరులు!!

కన్నురెప్పలు తెరవగానే నీ ప్రియను
వెన్నంటవో వలపు వలపంటు వేడవో!! మరులు!!
మరులుమాతంగి!!

జోల:

జోజో, జోజో, జోజో, జోజోజో
అందాలమల్లి నికుంజమందునా
పొందుగా నిద్రింపవమ్మ సుందరీ
చల్లగాలి చెక్కిళ్లపై సోకగా
మెల్లాగ సోగా కన్నుల తాకగా
తీయాతావీ వింజామర లాడగా
హాయిగా సుమాంగ నాళి పాడగా
జోజో, జోజో, జోజో, జోజోజో

మాయాజాలం:

రేగనీ చెలరేగనీ
మాయాజాలము, మధుమాయాజాలము !
పుష్పాడి దుమారము, స్వప్నపారావారము
ఉప్పెనౌచు పొంగి నిండనీ నిండనీ కాంతారము !
మధురసాలసారము దివ్యసౌరభవారము
దిక్కుదిక్కులా అల్లనీ అల్లనీ నీహారము !!
రేగనీ చెలరేగనీ !!!

మధువనస్వప్నసీమ
మధుమాయా పరివృతచ్ఛాయా సుందరము
నరులుగాని, సురలుగాని, పూవుల
నారాచాల వాడిమొనల కోడరె
తీయ విరులతేనె సుంత కనుగవ
పూయ ప్రియా ప్రియా యనుచు రోయరె
మధువనస్వప్నసీమా !

# వెలుగు

వెలుగు! నా వెలుగు!
ఈ జగము నిండిన వెలుగు!
కనుల ముద్దిడు వెలుగు
ఎద తియ్య నగు వెలుగు!
మనికి మొగసాలలో
నటియించు నా వెలుగు!
వలపుతీవల మీటి
పలికించు నా వెలుగు!
అంబరమ్మే విరిసి
అనిలము కడల దరిసి
అఖిలలోకమ్ము, హో
సాంచితమ్మై వెలసె!

# పెళ్లి కాకముందు

ఏమని, ఏ మేమని, ఏ మేమని!!
నా హృదిలోపల కోరిక యేదో
నాట్యము సేయును తీయని పాటై
కమ్మకమ్మని పూవుల తావులు
పలుకరించు పూరేకుల చాటై
హృదిలో కోరిక ఏ మేమని!! ఏమని!!

ఝుం ఝుం ఝు మ్మని పూవుపూవుపై
క్రమ్మెడు తుమ్మెద పాటల రొదతో
యీ వసంతమే గేలిసేయుగా
హృదిలో కోరిక యే మేమని!! ఏమని!!

# పెళ్లియాక

చిన్ననాటి స్వప్నసీమ
కన్నయూరు విడువలేము!!
ఎంతహాయి!
చింతా చీకు లేని చిన్ననాడు ?
ఎంత వంత,
ఎదిగి లోక మెరుగుకొలది, నేడు!!
తల్లి మరచి, తండ్రి మరచి, చెలుల, బంధువులను
కల్ల లనుచు, ప్రియములైన వెల్ల మరచిపోవలెను!!
చిన్ననాటి స్వప్నసీమ
కన్నయూరు విడువలేము!!

## జంటఊయెల

అతను: ఊయెల ఊపనా సఖీ
ఊయెల ఊపనా !

ఆమె: తీయగ పాడనా మీ
రూయెల ఊపగ ఊగనా !!

అతను: జీవితమే ఊయెలగా, కలగా
నీవే కలలో తీయదనముగా !! ఊయెల !!

ఆమె: ప్రకృతియె నేనుగ
పురుషుడు మీరుగ

అతను: ఆకాశము భూమియు ఏకముగా

ఇద్దరు: ప్రకృతిపురుషలీలయె ఊయెలగా
ప్రణయమధురడోలయె ఊయెలగా

ఆమె: భావగగనపుటంచులు మీరి
దేవలోకపుసీమలు చేరి

అతను: } ఏలుదమా యీ జగమంతా
ఆమె: } మరచి మనుజులచింతా, వంతా !!

అతను: ఊయెల ఊపనా !

ఆమె: తీయగా పాడనా !!

# ఆరుఋతువుల ఊయెల

జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

ఖళఖళ మను మెరపులలో
ఫెళ ఫెళ మను ఉరుములలో
ఝుర ఝుర పడుధారలలో
చర చర నర్తించు నెమలినై !!
జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

తెలిమబ్బుల నురగలలో
తెలివెన్నెల తరగలలో
పయనించు చంద్రనౌకలో
శయనించే తారాకోమలినై !!
జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

## ౩౦టఊయెల

అతను: ఊయెల ఊపనా సఖి
ఊయెల ఊపనా !

ఆమె: తీయగ పాడనా మీ
రూయెల ఊపగ ఊగనా !!

అతను: జీవితమే ఊయెలగా, కలగా
నీవే కలలో తీయదనముగా !! ఊయెల !!

ఆమె: ప్రకృతియె నేనుగ
పురుషుడు మీరుగ

అతను: ఆకాశము భూమియు ఏకముగా

ఇద్దరు: ప్రకృతిపురుషలీలయె ఊయెలగా
ప్రణయమధురడోలయె ఊయెలగా

ఆమె: భావగగనపుటంచులు మీరి
దేవలోకపుసీమలు చేరి

అతను: } ఏలుదమా యీ జగమంతా
ఆమె: } మరచి మనుజులచింతా, వంతా !!

అతను: ఊయెల ఊపనా !

ఆమె: తీయగా పాడనా !!

# ఆరుఋతువుల ఊయెల

జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

ఫళఫళ మను మెరపులలో
ఫెళ ఫెళ మను ఉరుములలో
ఝుర ఝుర పడు ధారలలో
చర చర న_ర్తించు నెమలినై !!

జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

తెలిమబ్బుల నురగలలో
తెలివెన్నెల తరగలలో
పయనించు చంద్ర నౌకలో
శయనించే తారాకోమలినై !!

జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

హేమంతరాజు కై దండనే
చేమంతి కుసుమాలదండతో
తెర తెరల నును మంచువలువలో
సిరు లొలుకగా పుడమి చెలువనై !!
జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

ఇల రాలిన ఆకులలో
తలవాల్చిన తరువులలో
చలిమంటల వెలుగులలో
వలపొలుకు చెంగల్వలతికనై !!
జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

తోటతోట చివురులు పోయా
బాట బాట పూవులు పూయా
జుమ్మనిపాడుచు తేనెలు గ్రోలే
తుమ్మెదరాయుని సుమప్రేయసినై !!
జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

తెలిమల్లెల పూలతోటలో
చలిపందిరి తేనెయూటలో
తరువు తరువు ఫలాలబరువులో
వరలి మురియు వనదేవతనై !!
జీవిత మూయెలగా
ఊగెద తియ్యనికలగా !!

# పూలచెండు!

అందుకోం డందుకోం డిదే!
అందుకోం డిదే! అందుకోం డిదే!
అందమౌ పూలచెం డిదే!! అందుకోండి!

మందమారుతమువోలె సోలుతూ
తేలి తేలి భువి వాలి తూలుతూ
కన్నెవలపువలె కమ్మవాసనల
చిమ్మి మైమరచుచెం డిదే!
తన్నుదా మరచి యెదిరి మరపించు
అందమౌ పూలచెం డిదే!! అందుకోండి!

అందదోయ్ అడుగు మందగించి వెను
కంజవేసినా అందదోయ్!
తొందరై అడుగు ముందు వేసినా
అందదోయ్ అదే మందదోయ్!
క్రిందుమీా దరసి చిందు తా వసి
పొందుగా అందుకోం డిదే! అందుకోండి!

# మేలుకొలుపు !

మేలుకొలిపెగా
తానే మేలుకొలిపెగా!

నామేనిసొగసులో
నిదురించే యౌవనము తానే!

ప్రేమ తెలిపి పలుకరించి
మేలుకొలిపెగా!! మేలుకొలిపెగా!

నా మదిలో నాట్యమాడు
నా తొలికోరికలే
మింట తోచి మెరసిపోవు
తారా మాలికలై !! మేలుకొలిపెగా!

రెక్క విప్పె నా కోరికలే
ఎక్క డెక్కడికో ఎగయా
చక్కనైనా వెన్నెలమేరుల
స్వప్ననౌకలలో సొగయా!

స్వప్ననౌకల తేలే కోర్కులు
సఫలము సేయడొ రయమున తానే !
మేలుకొలిపెగా!!

# మలయానిలుడు; దిరిసెనపూవు

దిరిసెన:— ఓ మలయపవనమా!

నిలు నిలు నిలుమా! ఓ మలయపవనమా!

మలయ:— ఓ విరిసిన దిరిసెనపూవా!

నిలిచిన బహుమతులా! ఓ విరిసిన దిరిసెనపూవా!

దిరిసెన:— బాటసారి నిలు నిలు మని

పిలువగానె బహుమతులా! ఓ మలయపవనమా!

మలయ:— బహుమతులే ఈయనిచో

బాటసారి పిలువనేల! ఓ విరిసిన దిరిసెనపూవా!

దిరిసెన:— మాటకారి బాటసారి

మాట చెల్లకుండు నేమి

అర్పించితి సర్వస్వము

అతిథిసేవగా తనకే ఓ మలయపవనమా!

మలయ:— తా నెవరో నే నెవరో

తనసంగతి నా కెందుకు

నీ వలపుల నీ తళుకుల

ఏవి నాకు బహుమతులో ఓ విరిసిన దిరిసెనపూవా!

దిరిసెన:— తొలిజన్మల వలపులలో
తొగిపిన తేనియలు!
వలపుల పుష్పాడి మెరపుల
విరిసిన మాధురులు! ఓ మలయపవనమా!

# స్వభాను!

రావే రావే నవవర్షా జగదభి నవహర్షా!
రావే నవప్రభాత శీతల
శుభానిలంతో స్వభాను!

దెసదెసలఁ, కెంజాయల మధుహాసనములు
ఎసగునవే తరులతల చివురు గుసగుసలు
ముసరునవే పరిమళ కుసుమోల్లసనములు!! ॥రావే॥

పల్లె పల్లెలఁ, పట్టణమ్ములఁ
బాలబాలికలు చెలరేగ, నీ
ఆగమనమ్మును గనరాఁగ,
దవ్వుదవ్వులను నవ్వులగొంతుల
యావనరమ ఉయ్యాల లూఁగ
జంటలుగాఁగ, నిను గనరాఁగ!!
విషాదగీతులు, విరాగగాథలు
వినంబడవులే
వినూతన మధూదయోత్సవమ్మున
విమోహనానంద మాధుర్యమౌ! ॥రావే॥

# మ ధు ఋ తు వు

వెలసె నహో ! వెలసె నహో
ప్రతివనమున మధుఋతువుసహో !
యౌవనము ! యౌవనము !
త్రిభువనముల నవయౌవనము ! !
వలపుబరువుతో వరుసలుగా
తరులతికలపై విరిసె నహో !
కుసుమాలు ! కుసుమాలు !
వనవనమున మధురసుమాలు !
మరంద ధారలు క్రోలుటకో
పరాగరాశుల తేలుటకో !
ముసరె నహో ! ముసరె నహో
కుసుమకుసుమమున భ్రమరాలు !

# చెల్లికి!

మెఱసె మెఱసె తారకాళి
మింట తోరణమ్మై!
మొరసె మొరసె భువనమెల్ల
దుందుభిస్వనమ్మై!
తరళ మధుర మధురామృత
కవితగానవల్లీ!
సురగాయకగణము పాడు
శోభనగీతులు చెల్లీ!
నీదు నవవసంతోదయ మీ
దినమున తల్లీ!
ఈ దినమ్ము తిరిగి రాక
మునుపే నీ పెల్లి!

# వసంతము

జగతికి వసంతమా

వసంతమా జగతి !!

అమృతవీణ నాగాన

ప్లావరించు దశదిశలను !! వసంతమా !!

షడ్జమును మీటి

మధ్యమమును దాటి

దైవతమును మీరి తార

షడ్జమును చేరి !! జగతికి వసంతమా !!

ప్రోడులయిన తరుల వీణ

మ్రోయగనె చిగురులు !!

సఫలాశయ హృదయమ్ములు

సఫలాశలగు వనమ్ములు!! జగతికి వసంతమా !!

పాడలేని ప్రతిగళమ్ము

పాడునే డనర్గళమ్ము !!

పాటలోన మరచు నాత్మ

మరపున నెరుగు పరమాత్మ !!

జగతికి వసంతమా

వసంతమా జగతి!!

అమృతవీణ నాగాన

ప్లావరించు దశదిశలను!! వసంతమా!!

# అందవు

అందవు అందవు యెంత చాచినా
　　యెడదల మొలిచే చేతులు !

ముందుకు ముందుకె యెంత చూచినా
　　బరువుగ మెరిసే చూపులు !

తడియవు తడియవు యెంత కురిసినా
　　వలపు జేడుల బడి యెడదలు !

తనియవు తనియవు యెంత విరిసినా
　　వెన్నెలసుడులలో కన్నులు !

అందవు అందవు యెంత చొచ్చినా
　　యెడదల దొలిచే చేతులు !

ముందుకు ముందుకె యెంత విచ్చినా
　　పెదవుల నమిలే చూపులు !

తెలియవు తెలియవు యెంత వ్రాసినా
　　బ్రతుకుల సంజెలగంటలు !

కలియవు కలియవు యెంత పొలసినా
　　ఒకటై రెండు యెడందలు !

# గతాగతం

చూచినకొలంది రాబోవు వత్సరా
లలసా లనిపిస్తాయి !

కడచినవి వెనుదిరిగి చూ స్తే
వేవేగ నడిచె ననిపిస్తాయి !

సంతోషమైన సంతాపమైన
ఒకజ్యోతి కమ్రసౌరభమే !

చిరకాలపు కర్పూరమ్మో !
కడచినకాలపు చందనమోకద !

# వికృతహాసం

హృది పొంగే తరుణ మధువనంలో
నిదురించా నొక నీరవరాత్రి
గుసగుసల నెసగి నా మదిలోన
కొన్ని కల లవెన్నో కదిలాయి!

మధూదయారుణిమచ్ఛాయలలో
హృది నిండే యానందముకొరకై
వెదకాడగ ప్రకృతియే వికృతయై
వికటహాస మొనరించినది!

# "గజల్"

హాయిలో నేల యెద కింత హింస?
తీయపాటలో బాధేల వంశీ !! హాయిలో!!

శకలశకలాలుగా నిన్ను విరిచి
వికలరుతు లందె జగతి మైమరచు!! హాయిలో!!

ఏల అమృతమ్ము నాశించు వీరే
నందనము నేలకే దించుతారే!! హాయిలో!!

మురళి నీ పాట నేల గద్గదము ?
రజనికంఠాన నేల బుద్బుదము ? హాయిలో!!

# విరహిణి రాధ

విరహానలంపు బాధ
భరియింపలేదు రాధ!
తన చూపే నీదు తేరు
చను దివ్యపథముగ గోరు
తన వినికియె నీ మురళీ
స్వనస్మృతానిలముగగోరు
విరహానలంపు బాధ !
భరియింపలేదు రాధ!

ఊర్పు వేడి వాడె విరులు
ఉరమునుండి యూడె సరులు
కేశరాశి అశ్రువారి
రాశితోడ కలగి పొరలు
విరహానలంపు బాధ
భరియింపలేదు రాధ!

## *స్వాగతము :

సంధ్యారుణిమ రుచిరజ్యోతులు
సకలపాంథులకు స్వాగతము
నందనవని హారిచందన వివృతా
నందాంగణమున స్వాగతము
ప్రసవసుగంధిల నిహారశీతల
పాద్యజలమ్ముల స్వాగతము !
విచికిలాక్షతా దధి మధు ఫలరస
రచితార్ఘ్యాంజలి స్వాగతము !
వసంతాంత మృదుకిసలయతోరణ
మసృణాంగుళముల స్వాగతము !
అదళిత కదళీ శ్యామ విసృమర
చ్ఛదనకరమ్ముల స్వాగతము !

---

*రాబోవు పదిపాటలు గ్రీష్మము అను సంగీతనాటికలోనివి.

# గ్రీష్మజృంభణము

నడిమింట చండరవి మండు నెండ కాచె!
వడగాలులు సుడి తిరిగి హోరు మని వీచె!
సడలి తరుపర్ణములు జరజర మని రాలె!
వడలి సుమఫలాలు సొగసుచెడి పడి తూలె!
కడలంటు బ్రదుకులను జీవరాశి రోసె!
బడలి మంచెపయి తోటమాలి కనుమూసె!

౨. ఈరేడుజగాలు కాలె ఈ గ్రీష్మ జ్వాలాకీల!
ఈ తాపమునార్చు నేత లేడు ఈపాపముతీర్చు త్రాత లేడు!
అనల మ్మనిలమ్ము కలిసి, ఆకాశము నొసట పొగలు
వనరుజీవజంతుతతుల బ్రదు కాశలకడలరగులు
ఈ తాపము ... ... ... ఈ పాపము
ప్రేమకొరకు మరిగి మండి వీగిలిపోయినవి ఎడదలు
క్షేమకొరకు సురిగి యెండి చీలిపోయినవి యేరులు
ఈ తాపము ... ... ... ఈ పాపము
వెతలను మరపించు దారి కతలు మాయమాటలోయి

వితలో యొండమావులే వినిపించే పాటలోయి

ఈ తాపము ... ... ... ఈ పాపము

ఈరేడుజగాలు సోలె ఈ గ్రీష్మ జ్వాలాకీల !

3. ఎండకారు, ఎండకారు, తోటలన్నీ పండేకారు

వనదేవత కావికురులు మెరసి వ్రేలు కెంజివురులు!

తెరల తెరల కమ్మతాల లోరసి మురులుజిమ్ము త్రోవ !

[ఎండకారు !

తరులనీడల వీనేందిర పరచికొనిన చలిపందిర

విరిదేనెలు ఫలరసాలు కురిసి నోరు నిండేకారు ! ఎండకారు !

తెరతీసిన మావితోట సురిగి చనెడు పికముపాట

తేటలోన మేను మరచి తోటమాలి పండేకారు !

ఎండకారు ఎండకారు తోటలన్నీ పండేకారు !

# తోటమాలి

తోటమాలీ! తోటమాలీ!
యేటి కింక లేవవు యీపాటికి నీ నిద్ర తేలి
తోటమాలీ! తోటమాలీ!

పాటిరేవులో కదలక పడవలాగిపోయినవో
ఏటినీరు రాక తోట యెండి మాడిపోయినవో
తోటమాలీ! తోటమాలీ!

మావిపండ్లు కావిలోన మాగిపోయెనో యేమో
తావి జారి పూవులన్ని రాలిపోయెనో యెమో
తోటమాలీ!...తోటమాలీ!

వడగాలులు వీచుచుండ, ఒడలుకాలి మండిపోవ
మడులలోని విత్తనాలు ముడిగి విడిగి యెండిపోవ
తోటమాలీ......తోటమాలీ......
యేటి కింక లేవవు యీపాటి నీ నిద్ర తేలీ
తోటమాలి! తోటమాలి!

౫ ఓసారి లెమ్ము ఓ తోటమాలి
హాసమ్ము చిందువదనమ్ముతోడ
ఓ తోటమాలి ఓసరిలి లెమ్ము లెమ్ము
ఓసారి లెమ్ము ఓతోటమాలి లెమ్ము!
వేసంగి సలగి వేగునే ప్రాణితతులు
ఈసారి లేచి ఈతీంపు జీవగతులు
ఆశాశ నందుకొనుమోయి లోకనతులు
ఓసారి లెమ్ము...............

వేసంగి క్రాగి వీగి భువి రిత్తవోయె
వాసంత జీవనపృహాయి నిత్తువేని
బ్రతుకంత మధుమ్మయ మ్మంచు మెత్తుమోయి
ఓసారి లెమ్ము ఓతోటమాలి
హాసమ్ము చిందు వదనమ్ముతోడ
ఓ తోటమాలి ఓసరిలి లెమ్ము లెమ్ము
ఓసారి లెమ్ము ఓ తోటమాలి లెమ్ము !

# నీ కెందుకు

తోటమాలిజోలి నీ కెందుకు !
తోటలో తేనెతేటలో తీయపాటలో మునిగి తేలక
వనములో సఖిజనముతో సుధాసవములో మునిగి తేలక
తోటమాలి జోలి నీ కెందుకు ?
తోటమాలి నిద్రింపనూ లేదు
తోటమాలి మేలుకోనూ లేదు
నీదు ఊర్పులో నాదు ఊర్పులో
నీపాటల నాపాటల మాటల
పెరుగులో విరుగులో తరుగులోన
పరుగువారు కనబడని తేజమూ
తోటమాలి జోలి నీ కెందుకు?
తోటలో తేనెతేటలో తీయపాటలో మునిగి తేలక
వనములో సఖిజీవనముతో సుధాసవములో మునిగి తేలక
తోటమాలి జోలె నీ కెందుకు?

# చలిపందిరి

విరిచెలువలార నవమాధవీనికుంజ
మందు కలయంపిగా తేనియలను చిల్కి
గండవాడు లల్కి పైడిసింగంపుపీట
లం దతిథివర్యు లెల్లరు నధివసింప
పజ్జ గొజ్జంగి చలువవీవనలు గొనుడు

*　　*　　*

బ్రదుకంచు గాసిలిన పాంథా
ముదియెండ శోషిలినపాంథా !
బరువైన చూపు విదళించు
చిరునవ్వు పెదవి గదియించు !
చలిపందిరిలోపల విందు
కలలూరు మధువనమునందు !!

మలుసంజ మంచు నునుజల్లు
వలికమ్మ తెమ్మెరల పెల్లు
ఎలదేటులార లే లెండు
విరిబోటులార రా రండు !!

నవవర్ష మధువులను తెండు
యువహర్ష గంధముల నిండు
క్రొవ్విరులతేనెజడి ముసురు
మవ్వంపు గందవాడి విసురు !!

చలిపందిరిలోపల విందు
కలలూరు మధువనమునందు
ఫలరసాలు నవశీధువులు
కలరవాలు యువమాధురులు !!

అజరుండవై తివిక పాంథా
అమరుండవై తివిక పాంథా
ఇదె ఆశకై సుధాపాత్ర
ఇదె ప్రేమకై సుధాపాత్ర
ఇదె స్మరణకై సుధాపాత్ర
విస్మరణకై సుధాపాత్ర!!

# వీడ్కోలు

తీయమావిచివుళ్లు మ త్తిల్ల మెసవి
పాడి తెగపాడి, కోయిలా నేడు నీవ
సంత మలరారు వేరు ద్వీపాంతరమ్ము
చనియు, వీడవు మా హృదంచలము లెపుడు !

*　　　*　　　*

చివురు గుబురుల గూటిలోనె దాగితివి
చివురు రసమును చేదుగానె త్రాగితివి
తీయతీయగ పాడి హాయి మనిపించుటే
కాని కంటికి కానరానె లేదోయీ !
రానే రావో కోయిలా! ఇక నీవు
పోనే పోదువో కోయిలా......
దెసల యంచుల పాట తేలి కరగేనో
మసలిమ్రాకుల తోట సోలి మరిగేనో
పాయకే మా హృదయఫలకాల చిత్రిత
మ్మాయెనే నీపాట కానరాలే దీవె

రానేరావో కోయిలా! ఇక నీవు
పోనే పోదువో కోయిలా.....

*          *          *

పోయిరావే కోయిలా
పోయిరావే కోయిలా
వీడుకోలే కోయిలా
వీడుకోలే
చివురుగుబురుల
గూటిలోన
దాగినావే కోయిలా !
చివురుకసమును
చేదు చేదుగ
త్రాగినావే కోయిలా !
తీయపాటల
హాయిగోలుపు కెగాని
కానరానె లేదోయి !!!
దెసల అంచున
నీదుపాట
తేలి కరగేనోయి
పసిమివెలుగుల
తోట సిలువున పులకరించేనోయి !!

# ఆశాగీతి

కనవో ప్రతిబింబుతు మధురీతి!
వినవో యీ ఆశాగీతి !
వడలో సందడిలో...ప్రశాంత
వనజనసంగతి నీ ఆశ !
జడిలో అలజడిలో...మనోజ్ఞ
శంపాద్రుతగతి నీ ఆశ !
చలిలో ఆకలిలో...కలిత
స్వప్నసుధాస్మృతి నీ ఆశ !
పువులోన మధువులో...హాసంత
కవిపికగళరుతి నీ ఆశ !
కనవో ప్రతిబింబుతుమధురీతి !
వినవో యీ ఆశాగీతి !

# గ్రీష్మసంధ్య

మెఱసినవి వినువీథి లోగిట వెలుగు తేనెలపైడిగిన్నెలు
కురిసినవి యీ తోటముంగిట ననుచు మల్లెలచలువసోనలు
ఒలసినవి యీ సంజవాకిట మధువులొలికిన పాటతేటలు
వెలసినవి యలసంపుబ్రదుకుల అమృతచైతన్యంపుబాటలు
ఒఱగినవి వెత లడగి యొడదలు మరపుటంచుల మెఱపుపాలకి
కరగినవి తరళిమలు కన్నుల విరియు మించుల తోటమాలికి!

# యక్షుని గ్రీష్మము

నీకు మాత్రము కాకపోయిన
నాకు సుంతయు లేకపోయిన
ఆ వసంత మ్మటులె గడచెను
నీవు లేకయె ప్రేయసీ!

ఎడద ప్రీల్చు వియోగశాపము
ఒడలు కాలుచు గ్రీష్మతాపము
జగమె యుడుకుచు నంటుకొన్నది
జ్వాలాతోరణ మౌచు నలుగడ
నీవు లేకయె ప్రేయసీ!

ఈ నిదాఘనిశీథి జాబిలి
పడ్చు నొంటిగ నుంచు పేర్లయి
ఈ వనిని సుమసౌరభమ్ములె
దావపావక శిఖల నుమియును
నీవు లేకయె ప్రేయసీ!

# ఏ లో ఏ లే లే

ఏలో కోయిల ఏలే
ఏలో ఏలేలే

కువ కువ కువ మంటూ
కురూ కురూ అంటూ
చివురులమాటున గొంతుక చించుక పాడే వేలే
చినుకులు రాలుటతోనే తోటను వీడే వేలే
ఏలో కోయిల ఏలే
ఏలో ఏలేలే !

కువ కువ మంటూ
కురూ కురూ కురూ అంటూ
చివురులరసమును చేదుగ చేదుగ తాగే వే లే
నవబుతుగీతము తీయగ తీయగ పాడే వేలే
ఏలో కోయిల ఏలే
ఏలో ఏలేలే !

కువ కువ కువ మంటూ
కురూ కురూ అంటూ
వడగాలుల సెగళ్ళాన ఓడిన వమృతపుచేం లే
కడిచే వేసవితోనే కదలుచుపోయే వేలే
ఏలో కోయిల ఏలే
ఏలో ఏలేలే ! !

# క్రొత్తపాంగు

మొయిలునడకలఁ గ్రొత్త హొయలు తోఁచినది!
మెఱుపుచిందులఁ గ్రొత్త మిసిమి మించినది!
నాకలమ్మును గ్రొత్త నడక నేర్చినది!
హృదయమ్ము క్రొంగ్రొత్త పదము పాడినది!

సీతమ్మ శోకమ్ము శ్రీకృష్ణులీల
శ్రీరాము సత్యవాక్పారీణతయును
గానమ్ముచేసిన కవిలోకమునకు
ముసలినీతులవలని మోసమ్ముచాలు
మతముపేరిటి ప్రాతకతలు చాల్చాలు
అని చాటుమాట యీ నా క్రొత్తపాట!

కవిసమయాల శృంఖలములఁ దవిలి
ఉత్ప్రేక్షలుపమలు నూరకే చొనిపి
రంభోరువులు హేమకుంభస్తన లని
అవయవమ్ముల నసభ్యముగ వర్ణించు

విరసప్రబంధాల వృత్తమ్ము లింక
కాలగర్భమ్మున గడ తేర్పవలయు
అను తేటమాట యీ నా క్రొత్తపాట !

అశరీరయగా సఖి యాశ్లేషమునకు
పవలు రేలను దీయ బాధలఁ బొగిలి
విరహాగ్ని కీలల వేగి తపించి
తనియక భావగీతములను వ్రాసి
తమయాతనలయందు గుములులోకమ్ము
వారిపై విరజిమ్మ వలను గా దింక
అను క్రొత్తమాట యీ నా క్రొత్తపాట !

దారిద్ర్య మంది స్వాతంత్ర్యమ్ము లేక
కష్టజీవిక ననుక్షణము భారముగ
గడపుచు ముక్తికై యడలెడు మనకు
జ్ఞానమ్మునకు గానరాని యమూర్త
భావాలు వృత్తమగా పద్యాలవేల
అను తెల్విమాట యీ నా క్రొత్తపాట !

కనకసౌధాల సుఖాపేక్షఁ గులుకు
స్వార్థపరులును సౌహార్దహీనులును
ఊడిగము చేయింప వాడు మొగాన

కాయకష్టము రక్తము చెమటూడ్చి
నవయు కార్మికుమాట నా క్రొత్తపాట!

దారిద్ర్యతమసాన జలధిప్రళయము
తలపించు కార్మిక తన్వి కన్నీటి
తేటఁగూర్చిన మాట నా క్రొత్తపాట!

జలధి ప్రళయములోపలఁ జిన్ని నావ
అనిపించు కార్మిక చినిపాప నవ్వు
రేక గూర్చిన మాట నా క్రొత్తపాట!

# శుక్తి విరహము

ఈవిదాహ మెటులారునో ! ఈ
ఈ హృదయతాప మెటుతీరునో !
జలదసఖుడు తన ప్రణయామృతమధు
కణము లెన్నటికి కురియునో !
ఈ విదాహ మెటులారునో!
ఆకసమ్ములో అమృతధారకై
అరయు నా కరవు బరువులో
విజనసీమలో వేదనాగ్నిలో
వేగు టెన్నటికి తీరునో !!
ఈ విదాహ మెటులారునో !!

---

రాబోవు మూడుపాటలు శుక్తి అను సంగీతనాటికలోనివి.

# నిరీక్షణ

ఈ తీరభూమిలో ఏకాకినిగ నీవు
ఎందుకై తపియింతువో సుందరీ ఎవనికై తపియింతువో!
చేయి కనుబొమలపై చూపు లాకసముపై
ఎండు పెదవులతోడ ఎగయుగుండెలతోడ
పొంగి నిన్నలరింపబోవు తరగల గనవు
నింగివైపే వెతల క్రుంగుచూవే కాని
ఈ తీరభూమిలో ఏకాకినిగ నీవు
ఎందుకై తపియింతువో సుందరీ
ఎవనికై తపియింతువో !

# శుక్తిముక్తాఫలము

"మెరపు తీగ లవిగో జలదవరః
ఘన గర్జన లవిగో!!
మలయ వాయువుల
పులకలలో షల
కలలకోరికలు
అలలై పొంగగ
హాయి హాయిగా
తీయ తీయగా
అమృతధార లవిగో!!
యుగయుగాలుగా
పగలు రేలు నా
పడిన వేదనా ఫలమో
తరళ తరళమై
ధవళ కాంతులను
మెరసెడి ముక్తాఫలమో!"

# నెమలి

ఆడుతోంది నెమలీ! తీయగ పాడుతోంది నెమలీ
రంగురంగుల తరంగవళులలో
రమ్యమైన పురివిప్పి గెంతుతూ ఆడు
తళుక్ తళుక్కని కన్నులు చెదరగ
మబ్బులపై నొక హరిచాపం!
అబ్బురముగ మెడ తిప్పి యాడు నా
నెమలిపించ మొక హరిచాపం—
మెచ్చగు పింఛము విచ్చేని!
విచ్చెడు గొంతుక హెచ్చేని
వనియే బృందావనియో తానే
నందకుమారుడో అనిపింప!
ఆడుతోంది నెమలీ! తీయగ పాడుతోంది నెమలీ!

# హరివిల్లు

అదిగో లేచెను హరివిల్లు!
హరివిల్లు! హరివిల్లు!
ఆకసమందున అందా లొలికే
ఏడు రంగులా హరివిల్లు! అదిగో !!

రవికి వాహనాలా? మబ్బుల
రథాలాచక్రాలా?
చూడ రమ్యమా చిత్రవర్ణముల
అమృతవాహినుల నును జల్లు! అదిగో !!

నేరెడిరస మెవరో విల్లున
నిలువున పూశారే
పాలపిట్ట రెక్కల నెవరో
బాగుగ కట్టారే! అదిగో !!

నీలనీలమై పచ్చపచ్చనై
అంచున విరిసింది___విల్లున

సంద్రము పాయో పొలాల చాయో
చక్కగ మెరిసింది !　　　　　　అదిగో !!

పాలవెల్లిలో పసుపుకుంకుమలు
నూరి యలదినారా !
కోరి కూర్చి శ్రీ శ్రావణలక్ష్మికి
గొడుగు నెత్తినారా !　　　　　　అదిగో !!

అదిగో లేచెను హరివిల్లు !
హరివిల్లు ! హరివిల్లు !
ఆకసమందున అందా లొలికే
ఏడు రంగులా హరివిల్లు !!　　　　　　అదిగో !!

# చినుకు పాట

చినుకు కన్నియల పరికిణి చెంగుల
చెంగున మెరిశాయే చిన్ని ముత్తెసరులు!
టిప్ టప్!...టిప్ టప్!...టిప్ టప్!......
పరికిణి చెంగులి మాటున బరువుగ
ఖంగున మొరశాయే సిరిమువ్వవరుసలు!
టిప్ టప్!...టిప్ టప్!...టిప్ టప్!...
చినుకు కన్నియల పెదవుల కెంపుల
కిల కిల విరిశాయే చిట్టి తటిల్లతలు!
టిప్ టప్!...టిప్ టప్!...టిప్ టప్!.........
పెదవుల కెంపుల మాటున పేరట
పిలుపులు పిలిచాయే పిల్లమబ్బుసడులు
టిప్ టప్!...టిప్ టప్!...టిప్ టప్!...
చినుకు కన్నియల ఊపిరిదారుల
తలుపులు తెరిచాయే వలపుపై రజడులు!
టిప్ టప్!...టిప్ టప్!...టిప్ టప్!......

# శ్రావణలక్ష్మి

శ్రావణలక్ష్మియై అవతరించింది
జగమెల్ల చలువయై పులకరించింది
మేఘాల రథ మెక్కి ఊరేగుతోంది
మెరపుల జండాల మెరసిపోతోంది
మసలు గాడ్పుల్లోన మాడిన లోకం
విసురు పయ్యెరలోన వీడింది శోకం
ఆకస మంతటా అల్లి వేసింది
ఊరూరనూ శాంతిభేరి మ్రోసింది
చల్లచల్లగ నయ్యె సూర్యుని తాపం
నల్లమబ్బుల నిల్చె నింద్రుని చాపం
శ్రావణలక్ష్మియై అవతరించింది
జగ మెల్ల చలువయై పులకరించింది.

# జానపదం

సేలమీాదీ పైరగాలీ—సల్లంగ
సెంప తాకీ లేపుతాదీ !
మణుసులో అణగారి మరిసీపోయిన కతల
మక్కువలూ రేపుతాదీ !
తెల్లావారిందంటూ తెలివొచ్చిందా అంటూ
మెల్లా మెల పలకరిస్తాది—జల్లుమని
వొళ్లెల్లా పులకరిస్తాదీ !

# ములగసిర

వొచ్చిందా తిరిగీ వొచ్చిందా !
తొంగిచూసిన ములగసిరకి పొంగిపోయే తొలిమేగం
వొచ్చిందా తిరిగీ వొచ్చిందా !
నల్లాకట్టి యేన్గులబారో
కొల్లేటీ కొంగలతీరో
అందాల మెరుపురథాలో
కిందా మీా దొతు నింగి రాలేయా పొంగి కూలేయా.
వొచ్చిందా తిరిగీ వొచ్చిందా !
యేటివొడ్డుని మొల్లరుప్పా
యెల్లువగా నవ్వింది !
నవ్వుతూ తనకళ్లా నవరసులూ రువ్వింది!
తళుకూలే ములుకూలై
వలపూలరేపంగ
వొచ్చిందా తిరిగీ వొచ్చిందా !
తొంగిచూసిన ములగసిరకి పొంగిపోయే తొలిమేగం
వొచ్చిందా తిరిగీ వొచ్చిందా !

# చాతకీ!

నీదుపాట విందుః—చాతకీ
నీదుపాట విందుః—లోకము
లేదు లే దనుచు వాదులాడినా
నీదుపాట విందున్

మంచున తడిసిన మల్లె పైపులో
మించి యలరు రేరాణి వలపులో
నింగి మబ్బులు మెలంగకుండిన ఆ
సంగ ఖేదమున ఆశాశలలో
నీదుపాట విందున్

చందనవిపినసుగంధవహాములో
మందమందపవమానగీతముల
మించు దీగలై విశ్వ మెల్ల పుల
కించు వర్షహర్షాగమమ్ములో
నీదుపాట విందుః—చాతకీ
నీదుపాట విందుః—లోకము
లేదు లే దనుచు వాదులాడినా
నీదుపాట విందున్

# వాన కోయిల

చిటపట చినుకులు రాలగ
కో యని కూసె నదే
చిటారు కొమ్మకొాస వాన
కోయిల హాయిగ తీయగ !!

ఎండలవేడిమి తరుగగ
మండిన యెడదలు తడియగ
తీయగ పండిన ఫలములు
తిని తిని గళమ్ము విరియగ !!

దారిని పోయెడు పాంథుడు
తలెత్తి చూడగను
పారెడు కాల్వల జలములు
పకపక నవ్వగను !!

చిటపట చినుకులు రాలగ
కో యని కూసె నదే
చిటారు కొమ్మకొాస వాన
కోయిల హాయిగ తీయగ !!

# మయూరీ!

నటన మాడవే మయూరి
నటన మాడవే !

కటి యిటు నటు కదలియాడ
చిరుపదాలు చిందులాడ
వంపుల మెడ సొంపు లొలుక
ఇంపుగ గళమెత్తి పాడి ||నటన||

చల్లని తడిగాలిపిల్ల
మెల్లగ నిను తాకెనుగా
రెక్కల సందున నేదో
చక్కిలిగింతాయెనుగా ||నటన||

ఆకసంపు టంచు దాటి
పైకి పైకి ప్రాకివచ్చు
నీలిమబ్బు దుప్పటాన
తేలియాడు కలలలోన ||న||

ఉరుములసడి మెరపులవడి
చినుకులజడి తాళముగా
సరస నీసఖుడు పురివిడి
వన్నెలకన్నుల చూడగ ||నటన||
నటన మాడనే మయూరి
నటన మాడవే !



7

# ఇంద్రధనుస్సు

నింగికి నేలకు వంగిన వంతెనగా
రంగుల కురిసే ఇంద్రధను స్సిదిగో!! నింగికి!!

సప్తాశ్వములు లాగెడు అరుణరథం
సప్తవర్ణ దీప్తమగు గగనపథం
వర్ణ వర్ణముల విద్యుజ్జాలికలు
కర్ణ పర్వమన్మరిత కథానికలు!! నింగికి!!

నేరెడుఫలముల ప్రోవుల నిగనిగలు
బారులు తీరిన పాలపిట్టజతలు
చాయలు తేరిన సంద్రపుపాయ లవే
పాయలుతీరిన పొలాలచాయ లవే!! నింగికి!!

పసుపు నలందిన దిక్కు-లకడప లదే
నొసటను కుంకుమతో మిను వెలది యదే
జేగురు నేలువ ప్రేలెడు చెలువ మదే
శ్రావణలక్ష్మికి నిలిపిన ఛత్ర మదే!! నింగికి!!

# అభిసారిక!

గాలివానరేయి! నిన్నీ
కానలోన నెటులు కాంతునోయీ!!
మనసులోన ఊరు తీయకోర్కెలు
కనుల యెదుట నాడు నీడలై
ఇరులు చీల్చి దూయు మెరపుతీవల
తళుకులోన చెరిగి కరగునోయి!!
హృదయమందు నిన్ను గూర్చి మాటలు
కదలియాడు తీయపాటలై
ఉరుము సడుల నుడిగెనోయి పాటలు
వెరపులోన దారి కాననోయి!!
పొదరుచాటో తీవమాటో నిల్చితో
వెదకలేను వేసరిలితినే!
ఇరులలోన ప్రొద్దు తెలియదే నీ
విందు వచ్చి వెడలిపోయితేమొ!
గాలివానరేయి! నిన్నీ
కానలోన నెటులు కాంతునోయి!

# జలదాగమనం

మురళీధరుని మోహనగానము
మరల వినబడునదే!

గోపభామినికి పోయినస్వర్గము
తిరిగి కనబడునదే!!

గోపభామినికి గ్రీష్మమంతయు
హరివియోగమున వలవంత!
శౌరిరాకచే జలదాగమమున
ఆనందమ్మగు కొండంత!!

జలభరితములౌ చల్లని మెల్లని
జలధరముల నడకలలో
మదమయూర సమ్మదనాట్యమ్ముల
మృదుకేకారవములలో!!

శిఖిపింఛము తన శిరసున మెరయ
అఖిలలోకములు మురియ

శ్రావణనీరదశ్యామల దేహుఁడు
బృందావనిలో వెలయ ! !
మురళీధరుని మోహనగానము
మరల వినబడునదే !
గోపభామినికి పోయినస్వర్గము
తిరిగి కనబడునదే !

# మే ఘ మా!

మేఘమా ! మేఘమా !
గంగవలపులో సొలపులో
బెంగయూర్పులో
కనలు నెండలో తేలుతూ
గగన మంటెదో ! !— మేఘమా !
హృదయ మావిరుల్ వదలుతూ
కదలి కదలకే
కుంగి పొంగుతూ నింగిపై
కంగ చాపుతూ
నిండుకడలి తేడెగా నీకన్న
తండ్రి! కన్నతండ్రి! !— మేఘమా !
వలపు టలలలో కలలలో
వగల సగమయీ
వెలుగుపొరలలో యిరులలో
తిరిగి షరుగయీ
మరుగుప్రేమికుల్ నీ
కన్నదమ్ము లన్నదమ్ములు ! !— మేఘమా !

# దిగకోయి!

మెరిసే మబ్బులలోనో
విరిసే పూవులపైనో
చరియించే నా చెలీ! చెలీ!
మేను
పులకించే—నాచెలీ చెలీ!
దివ్యలోకమునుండి
దిగకోయి దిగకోయి
దేవతామూర్తి నా చెలీ!
వలచే గాలులపైనో
తలచే దారులలోనో
తలపించే నా చెలీ చెలీ!
మేను
మఱపించే నా చెలీ చెలీ!
దివ్యలోకమునుండి
దిగకోయి దిగకోయి
దేవతామూర్తి నా చెలీ!

# ఉజ్జయిని పిలుపు

"రమ్మోయి ! జలధరా ! మదభరా !
స్వాగతమ్మోయి ! అమృతధారాధరా !
ఉజ్జయిని ప్రేమసామ్రాజ్యాల నెలవంచు
ఊరూర నింటింట మారుమ్రోగగ నిమ్ము ! రమ్మోయి
ఆమహాకాళు ఫాలాక్షి కెంజాయ !
అభిసారికల పాదలాక్ష క్రొంజాయ !
ఆనందధామాన నరయగా రమ్ము !
ఆమంద్రరవళి నాలాపించి పొమ్మోయి !
రమ్మోయి ! జలధరా ! మధభరా !
స్వాగతమ్మోయి ! అమృతధారాధరా!"

# అలకానగరి!

ప్రణయజీవనపు బాటలకలిసే
వలపుతోట అలకానగరి!
ప్రణయిహృదుల పులకలొచు మొనసే
కలికావళి అలకానగరి!
తీయతావి తెరలందు చిందు క్రొం
దేనెలాను భ్రమరావళులు!
తేలి సోలుచును జోలపాడు భ్రమ
రాళి వ్రాలు కుసుమాళులు!
హాయి మీరగా నూయ లూగు కుసు
మాళితో తరులతావళులు!
మందాకినిపయి నందగించు నవ
నందనాళి జ్యోత్స్నావళులు!
కరములలీలా కమలాలు
అలకల తెలిమొల్ల సుమాలు!

ముఖములపై లోధ్రరజాలు
శిఖలను విరియు కురవకాలు
సీమంతముల కడిమిపూలు !
తలపగలమే అలకానగరి
లలనావళి చక్కదనాలు !
వలపు లోలుకు తియ్యదనాలు !

# మేఘరంజని (1)

ఘనాఘనా ! ఘనాఘనా !
గర్జింపవా ! ఘనాశని ! !　　　　ఘనాఘనా ! !

దిశాంతములనుండీ పైకి
కొసల్ బిగించి లేవనీ
ప్రశాంత సమీర ప్రసరిత
పయోధర వినీలశాటి ! !　　　　ఘనాఘనా !

వియత్తలిన్ తటిల్లతల్
చలచ్చకితలై పారగ
ధరాతలాన వారిధుల్
నభోంగణమ్ము మీరగ !!　　　　ఘనాఘనా !

చిటుక్ చిటుక్ చిటుక్ చిటుక్
చిద్రుప లౌచు చినుకుజేడులు
ఝరత్ ఝరత్ ఝరత్ ఝరత్
ఝరులై ప్రవహించుధార

ధారాధరా! ధారాధరా!
కురియింపవా! ధారాఝరి!
ఘనాఘనా! ఘనాఘనా!
గర్జింపవా! ఘనాశని! ఘనా ఘనా!!

# మేఘరంజని (2)

హే దయాంభోధరా పర్జన్యా
ఏదయా నీజీవధార !

నా ధ్యానమందు నా గాన మందు ఉ
డ్డీన మౌ వేడి యావిరుల్ !

వినువీధి దాటి ఘననీలశాటి
గా పైకి లేచునా తెరతెరల్
భూమ్యంతరాళముల వంతెన లౌ వి
ద్యుల్లతల్ తనుపు హృల్లతల్
దిగ్దిగంతరమ్ముల మారుమ్రోయు గ
ర్జనములకై మురియు మనములు !

వలిగాలి వీచ జలధార లౌచు, ఝుర
ఝురా ఝురా ! ఝుర ఝురా ఝురా !

హే దయాంభోధరా ! పర్జన్యా పడె
నయా నీ జీవధారా !

# వరలక్ష్మి!

స్వాగత మమ్మా !
శ్రావణ వరలక్ష్మి !
దయాకువలయాక్షీ !
స్వాగత మమ్మా!
వినీలజలదాంచలా !
చలచ్చంచలామేఖలా !
ఝరీమృదులకుంతలా !
ఝళంఝళితధారానూపురా !
స్వాగత మమ్మా !
శ్రావణవరలక్ష్మి !
చందనానిలశీతలా !
కుందకుసుమమృదుదరస్మితా ! !
మధురాశాడోలికా ?
ఫలభరితోద్యానమాలికా !
స్వాగత మమ్మా !
శ్రావణ వరలక్ష్మి ! !

# వాల

యెయ్యరా వాల యెయ్యెరా
యిసి రెయ్యరా వాల యెయ్యరా!
సెంద్ర వాంక రూపుమానే! మబ్బు
సీకట్లు రేతిరి కాసె!
సంద్రమ్ము హోరున మ్రోసె! కెరటాలు
మింటిపై పురకలు వేసె!! యెయ్యరా వాల!!
కెరటాలు విరిగినకాడె! మిల మిల
మెరిసేటి సేపలతోడ!!
బరువైన వాల లాగినావా! ఇల్లె
బంగార్మై తూగినావా!! లాగరా వాల!!
కన్నులుసెదిరిని నేడు! వాలలో
వాన్నెల సేపలు సూడ!
కొంపలో కుంపటికాడ—కునుకు
కోడలు ఆసతో సూడ! యెత్తరా వాల!!

# అభిసరణ

సఖుని గాంతునే! ఆహా సఖుని గాంతునే!
నీలిమబ్బు మేలిముసుగులో
తేలిపోవు తారానారినై
తరువు తరువు వెనుక తారుచు
అడుగ డుగున నూహ లూరుచు
ఆహా సఖుని గాంతునే
మోమున చిరునవ్వు మొలకలో
మ్రోల నిలిచి తీయపలుకులో
మైమరపున మధువు లొలుకగా
ప్రేమడోల నోలగింపగా
ఆహా సఖుని గాంతునే! ఆహా సఖుని గాంతునే!

# కృష్ణ జననం

భువననేత శాంతిదాత
పురుషోత్తము డవతరించె
పృథివీతలి నెట యెట యెట ?
మధురానగరి !—యెట యెట
మధురా నగరి !

ఆశాహ్రదు లోలలాడె
ఈరేడు జగాల
అలవైకుంఠ మిలా గలి
కవతరించె నెట యెట యెట ?
మధురానగరి !—యెట యెట
మధురానగరి !

జగతీప్రజ కిక అంధతమో బంధన తొలగు ననుచు
ధర ధర్మదేవతకు స్వేచ్ఛాసుగతులు కలుగు ననుచు
వసుదేవదేవకీదేవుల వరములు పండె ననుచు

గలగల మని యూడిపడెను కరచరణశృంఖలాళి
చరచర మని తెరచుకొనియె చెరసాల ద్వారపాళి
ఎడ యెడముగ పాయ విచ్చి యమునానదీమతల్లి
శిశువుతోడ వసుదేవున కొసగె త్రోవ రేపల్లె!
దూరమాయె దూరమాయె
దురహంకృతి నిరంకుశత!
ఇలాతలిని ధర్మపరత
నెలకొన్నది యెట యెట యెట?
మధురానగరి!—యెట యెట
మధురానగరి!

# కృష్ణావతారం

బృందం:—అల వైకుంఠపురంవారం! మేం
శ్రీమహావిష్ణు పరివారం!

గరుడ:—అందమైన రెక్కలూ
అనంతమైన వేగము గల
గరుడుడ నేనె!
శార్ఙ్గధనుష్పాణి జగము
లేల తిరుగు తేప నేనె!
దేవరాక్షసుల పోరుల
విష్ణువాహనము నేనే!

బృందం:—అల వైకుంఠపురంవారం! మేం
శ్రీమహావిష్ణు పరివారం!

సుదర్శనం:—కృష్ణుని తర్జని కేంద్రముగాగ
గిరగిర తిరిగే చక్రము నేను!
మధ్యందిన మార్తాండునిపోలె

మహాతేజమున మెరయుదు నేను
సముద్రమథనపు సమయమునందున
అనేకాసురుల హాత మొనరించిన
కృష్ణుని తర్జని కేంద్రముగాగ
గిరగిర తిరుగు సుదర్శన మేను!

బృందం:—అల వైకుంఠపురంవారం! మేం
శ్రీమహావిష్ణు పరివారం

శార్ఙ్గము:—శార్ఙ్గము నేను
కురంగపు వంపుల సొంపుల ధనువును నేను
వైకుంఠేశ్వరుడౌ శ్రీమహావిష్ణువు ధరించే
సుందరధనువును నేను
స్త్రీవలె తోచియు పురుషుని
ధైర్యముతో చెలగుదును
రథ గజ తురగ పదాతుల
రాక్షసబలము లడంచిన
వైకుంఠేశ్వరుడౌ శ్రీమహావిష్ణువు ధరించే
సుందరధనువును నేను!

గద:—హరి ధరించు గద నేను!
కౌమోదకి నా నామము!

సరయూనది మథించితిని !
చంపితి ఘోరాసురులను
హరిధరించు గద నేను !
నా నామము కౌమోదకి !

పాంచజన్యం:—భం భం భం, భం భం భం, భం భం,
పాంచజన్యమును నేనే !
పాలకడలి జన్మించినతోడనె
శ్రీపతి ముదమున చేపట్టెను నను
నా నాదముతో దేవవైరులకు
నాశ మ్మొదవును రణాంగణమ్మున
భం భం, భం భం, భం భం, భం భం,
పాంచజన్యమును నేనే !

ఖడ్గం:—నందకమను ఖడ్గమ్మును
న న్నెదిర్చి రణమ్మందు నాశమ్మే పొందుదురు !
తలచినతోడనె విష్ణుని కరమ్మంటి మెరయు నేను
నందక మను ఖడ్గమ్మును !

బృందం:—అల వైకుంఠపురంవారం !
శ్రీమహావిష్ణు పరివారం !

ఆ మహావిష్ణు వవతరించె, లో

కావనార్థమై వ్రజభువిలోన !

మేమంతా గోగోపజనమై

అనుసరించెదము విష్ణునిసేవ !

అల వైకుంఠపురంవారం !

శ్రీమహావిష్ణు పరివారం ! !

# * వైతాళికగీతులు

మేలుకో స్వప్నలోకరాజ్ఞీ మేలుకో
చాలింక నిదుర శాక్యరాజ్ఞీ మేలుకో
నిశాతమస్సులు నిరాసములై నశించెనులే
దిశాంతభూమిని ఉషఃకామిని హసించెనులే
ప్వాంతమ్ముల శాంతహిమధునులు వర్షించెనులే
అంతరమున నఖిలవిశ్వమును హర్షించెనులే

* రాగల 20 పాటలు బుద్ధచరిత్రాత్మకమైన దివ్యజ్యోతినాటికనుండి.

# మాయాదేవిస్వప్నం

నిద్రాముద్రితవు కన్ను
సార్వభౌమినీ !
విశ్వజ్యోతిష్మతీ ప్రమోదయామిని
స్వప్నలోకచ్ఛాయావీణా
సమ్మోహననిస్వనాలు
సర్వదిశల విస్తరిల్ల
సార్వభౌమినీ
విశ్వజ్యోతిష్మతీ ప్రమోదయామిని

*   *   *

విహరింపవె మారాణి
మోహన
నిహారపథ సోపానపాళిపై !
అలసనిమీలిత సుందరనయనా !
పులకిత సకలాశామృదుశయనా !
మహనీయాశయ కాంచనసదనా !

విహాసన మధువర్షాంచితవదనా !
విహారింపవె మారాణి !

మోహాన

విహారపథసోపానపాళిపై
విహారింపవె మారాణి !

# ప్రబోధము

చైత్రజీవచైతన్యము గొను మీసారి
మర్త్యశరీరీ!

ఆర్తిహాలహాలధారీ!
ఆనందసుధక్రోలు మీసారి!
శాంతతరళశుభకాంతిలో
చందనానిలభ్రాంతిలో
ప్రాచీదిశ నరుణరోచిలో
ఆశా లసదమృతవీచిలో!!—
అఖిలేశ్వరనూ తేజస్సే
నకలలోకైకమూ వర్చస్సే
శాక్యరాజ్ఞిగర్భమునందు
జ్ఞానరవియై జనన మొందు!
చైత్ర జీవచైతన్యము గొను మీసారి!
మర్త్యశరీరీ!

ఆర్తిహాలహాలధారీ!
ఆనందసుధక్రోలు మీసారి

# వైతాళికగీతి

మెరయు దిశాముఖ మే మన్నది యే మన్నది?
మరుగు నుషశ్శిఖ యే మన్నది ?
తెలివివెలుగులో శతసూర్యచ్ఛవి
మెలఁగనీని తేజము కలుగు నని !
పొరలు సాగర మ్మే మన్నది యే మన్నది ?
కెరలు చకోర మ్మే మన్నది ?
చలువవెలుగులో శతచంద్రప్రభ
తొలఁగద్రోయు తేజము కలుగు నని !
ఎరగు హిమశిఖర మే మన్నది యే మన్నది ?
కరగు గిరిఝర మ్మే మన్నది?
ఎడదలోతులో హిరణ్యగిరినే
కడకు ద్రోయు తేజము కలుగు నని !
విరియు పంకజ మ్మే మన్నది యే మన్నది ?
ఉరలు పరాగ మ్మే మన్నది ?
వలపుబరువులో అమృతభాండమునె
తలపనీని తేజము కలుగు నని !

# గౌతమబుద్ధుని జననం

ప్రమదావని కింశుకసాలము
కకుబంతసృత మృదుకిసాలము
కమనీయ సురభిసుమజాలము
హిమశీకర సించితమూలము

కింశుక పర్ణచ్ఛాయాకుంజములోన సంపూ
ర్ణాంశుమతి రాణి స్వర్ణతర్దికపైని
విశ్రమించి నయనముల సుధారుచు లెసగ కన్నది
అశ్రమమున అఖిలేశు నంశమానినుఁగు!

* * *

కలలు ఫలియించి జగతి వెలిగించు సుతుడు రాణికి జనించె
మలయానిలము లలమి లుంబినీవనము నందనమ్మై మించె
మాధవీలతిక వలపించి ప్రోవులై పూచె కోటపైని
బోధితరుశాఖ పులకించి మొలకలై లేచె తోటలోన!

* * *

రాజసౌధ మజరావనము !

రమ్యమానంద కాననము !

దివ్యశరీరులు తిరోహితులై చరించిరి

దిక్పాలకులు సువర్ణ పాలిక వహించిరి !

రాణిని సూనుని రాచనగరు చేర్పించిరి !

కానికలను దీవెనల ననల నర్పించిరి !

రాజసౌధమజ రావనము !

రమ్యమానంద కాననము !

# అసితముని ఆవేదన

అసదృశ తేజోవర్తీ!
శిశుమూర్తి శిశుమూర్తీ!
అఖిలము వెలిగించు జ్యోతి వీవె నీవె నీవె!!
కనగా గలిగితి నిన్నుమనకమలినీ సుధాధునీ!
జరాభరితుడనే నేను
వినగలనే యిల శాసనములా
నీ మృదులభాషల మధురకలస్వని
కిసలయారుణాస్మా నీ
మసృణ చరణాతలమున నను
పొరలనీ! తరలనీ!
చింతారహితముగ సుప్రశాంతియుతముగ
నా వయోజీవిక నిక మరలనీ
సురుగనీ! పరలోక స్మరుగనీ!
యువమానవ భావిమార్గవర్తీ!
భువినవతారమతా స్వర్గశక్తీ!
అసదృశ తేజోవర్తీ!
శిశుమూర్తీ! శిశుమూర్తీ!

## ఏనాడో యేనాడో

ఈ నాడె కాదు ఇం కే నాడో యే నాడో
ఈ గాలి నెరుగనే నేను?
ఈ నేల తిరుగనే నేను?
మనసు నలరించు కమ్మని గాలు లివి యవే
తనువు సొలయించు చల్లని దారు లివి యవే!
ఈ నాడె కాదు ఇం కే నాడో యే నాడో
ఈ గాలి నెరుగనే నేను?
ఈ నేల తిరుగనే నేను?
ఎరుగనే వీరు నా బంధులు! వీరు నా బంధులు!
మనసు కలిసియు కలియకుందురు
సరస నిలిచియు నిలువకుందురు!
ఎరుగనే వీరు నా బంధులు! వీరు నా బంధులు!
ఈ నాడె కాదు ఇం కే నాడో యే నాడో
ఈ గాలి నెరుగనే నేను?
ఈ నేల తిరుగనే నేను?

# స్వయంవరం

కామదేవు కొలువున వలపుల
రేకలను విరియు ప్రసవాలమోయి
కనవోయీ ! కనవోయీ !
ఓ మధుపాయీ ! కనవోయీ !
హృదయములో కస్తూరులో
మది నలలొ చంచలలో !!—
పువుశరాలు మైమరచెనో !
యువహారిణి దెసలుపరచెనో !
పసవిడు వలపుల ప్రసవమ్ము నెటుల
బహుమానింతువో భ్రమరకుమారా !
మదనవిశిఖలకు మెరుగగు విరి నెటు
బహూకరింతువో భ్రమరకుమారా !

# సోమరి పాట

ఆమని పొంగులో
అలరు లేమ ముసుంగులో
సోమరిగాయకుండు
నే డేమని పాడెనో, బ్రదుకు
నేమని పాడెనో,
ఎందుకని—సౌందర్య మెవరికని!
కమ్మనైన విరిముసుంగు చాయనే
వేడిరక్తమ్ము చిమ్ము కంటకమ్ము గాయమే!
ఎందుకని—సౌందర్య మెవరికని!
ఆకటి బాటలో
అలము చీకటి తోటలో
సోమరిగాయకుండు
నే డేమని పాడెనో! బ్రదుకు
నేమని పాడెనో,
దుఃఖమ్మని—సౌఖ్యమ్ము దూరమ్మని!

బ్రదుకు తెరువు నరయు ప్రాణి గొంతులో
బెదరి యుసురు వదలు నల్పజీవి జాలి వంతలో
దుఃఖమ్మని—సౌఖ్యమ్ము దూరమ్మని!
ఆమనిపొంగులో
అలరు లేమముసుంగులో
సోమరిగాయకుండు
నే డేమని పాడెనో, బ్రదుకు
నేమని పాడెనో!

# భ్రమర ప్రబోధము

భ్రమరా! ఓ భ్రమరా!

సిరుల తెరలలో పొరయు నిరులలో
ఒరగు మనికి చాలు లే చాలు లే

మేలుకో వేల, మేలుకో వేల
భ్రమరా! ఓ భ్రమరా!

చెలిమికలలో వలపుటలలో
కరుణ తెలిసి మేలుకో మేలుకో

చాలు లే నిదుర, చాలు లే నిదుర
భ్రమరా! ఓ భ్రమరా!

* * *

# భ్రమర ప్రబోధము

భ్రమరా ! ఓ భ్రమరా !
సుమభవనము విడుమా !

మర్త్యజీవిత మ్మన నే మనుకొన్నావు ?
ఆర్తస్వరమో భరమో నిశ్వాసనమ్మో
ప్రలయశ్రుతియో సంతత హింసారతియో
భ్రమరా ! ఓ భ్రమరా !
సుమభవనము విడుమా !

దేశదేశముల ప్రమోదలేశము కానము కానము !
ఆశ లరయు నయనమ్ముల రాలిన వశ్రులు అశ్రులు !
అంతఃపుర మేల ప్రణయ సంతర్పణ మేల లెమ్ము !
భ్రమరా ! ఓభ్రమరా !

# చితిజ్వాల

రగిలి మండెను చితిజ్వాల !
ఎగసి యార్చెను దహనకీల !

మేడలో వాడలో తోటలో బాటలో
ఆడుతూ పాడేటి కునుకుతూ కుల్లేటి

తనువు మండెను చితిజ్వాల !
కనలి యార్చెను దహనకీల !

వలపులో వంతలో ఆసతో ఈసుతో
ఎగురుతూ గెంతేటి వగచి వగపించేటి

తనువు మండెను చితిజ్వాల
కనలియార్చెను దహనకీల !

# ఉజ్జ్వలప్రభాతము

అమలహృదయ కమలాకరా !

సకల వికలజనార్తితమోహరా !

నిద్రారహితములో నీ నేత్రమ్ములవలెను !

హిమార్ద్రములో దిశల నరుణరాగమ్ము ప్రబలెను!

అదిగో ! ప్రథమ శకుంత మనోహరగానమ్ము !

అదిగో ! ప్రాసాదాంగణఘంటాధ్వానమ్ము !

# ప్రస్థానము

ఈ యిరులుచీల్చుకొని యే వెల్గు పిలిచెనో
యేగుమోయీపథికుడా !
యిలు వీడి
సాగుమోయీ పథికుడా !
ఏ కొసకు సాగేవో ఆ దెసనె ప్రోగౌను
ఆశాప్రశాంతకిరణాలు !
వాగౌను
అమృతవాణీపురాణాలు !
ఇరులలో కడలంట మఱుగు తారలు మింట;
మనుజహృదయాల పెనుమంట
కలదంట
కనలు నీకనుల కొనలంట !
జగములోపలి వంత మనసులోపలి చింత
తొలగింప నీ యాత్ర కంతు !

యుగ యుగ
మ్మిలను జన్మింప నీ వంతు !
ఈ యాంత్ర వల దంచు నెవరు పలికేవారు ?
ఎవరు ని న్నాపగలవారు ?
లోకాని
కెవరు సంతాప మౌవారు ?

# వియోగిని

హృదయేశ్వరు డెందు పోయెనో యిక
నేనాటికి నిందు రాడుగా ! !—
బ్రదు కంతయు వంతపాలుగా, ఏ
పాపమ్మున కింత శాపమో ! !—
ఎదలోపల నాడిగియున్న కోరిక
లెపుడే నెరిగింపనై తినే !
ఇపుడే యవి పొంగి కూలి చీలిక
లై పోయిన నేమిసేతునో ! !—
అరవిచ్చిన పారిజాతమాలిక
సురమం దొకగడెయు తాల్పదే !
తడి యారని దాని యూర్పు వేడిమి
వడి సుసిగాఁజాల నేలనో ! !—
హృదయేశ్వరు డెందు పోయెనో యిక
నేనాటికి నిందు రాడుగా ! !—

# వైతాళికగీతి

పాలపుంత పర్వతముపై ప్రాలి పవ్వళించినదిలే
నాలవజా మింక భూమిపయి చిరునవ్వు నుంచినదిలే !
వేగుజుక్క ఆశ లల్లు చూడ్కుల వేసటలో
రాగశాటి యోసరిల్లు అంచుల బాసటలో
పాలపుంత పర్వతముపై ప్రాలి పవ్వళించినదిలే
నాలవజా మింక భూమిపయి చిరునవ్వు నుంచినదిలే !

## విరాగగీతం

శ్రుతులు సమముగా బిగించి
నదింపు మోయీ విపంచి! ......... శ్రుతులు

మనోహరమ్మగు హాయలుతో
అనేకరీతుల లయలతో
వినూత్న గీతులు సాగవో
వియోగతంతులు వీగవో! ......... శ్రుతులు

తీగ శ్రుతి మించి లాగిన
సాగకే రాగ మాగునే!
తీగ శ్రులు బిగి సడలిన
మూగయై రాగ మడగునే! ......... శ్రుతులు

* * *

# విరాగగీతం

గడ్డిపువ్వు సుఖము
  నీకు కలదా మానవుడా!

ఎండగాడ్పులందు గాని
వాన పరదలందు గాని
మంచుజడులయందు గాని
చింత, చీకు, వంత, వాదు
సుంతయేని లేని చిన్ని ||గడ్డి||

చిన్ని పూవుపైని యెగురు
సీతాకోకచిలుకయేని
హాయిగా క్రొంజివురులందు
కూయుచుండు కోయిలేని
సొగసు వెరచి సురిగిపోదు
బ్రదుకు వెరచి పారిపోదు
జ్ఞానీ మానవ నీకె తగుర!
గడ్డిపువ్వు సుఖము
  నీకు కలదా మానవుడా!

# బోధిమహీజం

ఆశాంతర చుంబితకాంతిలో
వాసంతికా మధురభ్రాంతిలో
శకుంతలోక సురభూజము !
సుప్రశాంతము బోధిమహీజము !
బోధితరుచ్ఛాయాస్థితుడా గౌతముడు
ప్రపంచ
బాధాశమన విభాకర తేజోధనుడు !

# *ఒక్కడవే!

ఒకరయినా నీకేకకు ఓ యని రాకున్నా
ఒక్కడవే బయలుదేరు!
ఒక్కడవే బయలుదేరు
ఒక్కడవే ఒక్కడవే ఒక్కడవే బయలుదేరు!

ఓరీ ఓ అభాగ్యుడా,
ఊరంతా భయంచేత
గోడవైపు తిరిగి మాట
లాడకుండ నిలుచున్నా
మనసు విప్పి లోలోపలి
మర్మ మేదో కంఠ మెత్తి
నీకు నీవె చెప్పవోయి!

ఒక్కడవే ఒక్కడవే ఒక్కడవే బయలుదేరు!

---

*రవీంద్రుని ఏక్ లాచలో అను గీతమునకు అనువాదము. మహాత్మునకు నవఖాలీలో ఈగీతము ప్రబోధానికి సహాయపడింది.

ఓరి ఓ అభాగ్యుడా
ఊరంతా నీ నొంటిగ
కారడవిని వదలి, తోడు
గా నెవ్వరు రాకున్నా
ముళ్లదారి తొక్కిళ్లకు
కాళ్లు నెత్తురే చిమ్మగ
నీ వొకడవె నడువవోయి !

ఒక్కడవే ఒక్కడవే ఒక్కడవే బయలుదేరు !

ఓరి ఓ అభాగ్యుడా
ఒకరైనా నీ ముంగిట
కారుమబ్బు కాళరాత్రి
దీపమైన చూపకున్న
పిడుగుమంట కాల్పులోన
పడి మండే నీ గుండెల
ఒంటిగానె వెలుగనీయి !

ఒక్కడవే ఒక్కడవే ఒక్కడవే బయలుదేరు !

# ఆగమనము!

చల్లగాలిలో యమునాతటిపై
శ్యామసుందరుని మురళి!
ఉల్లము కొల్లగొనే మధుగీతులు
మెల్లమెల్ల చెవి సోకు నవే!
తూలి రాలు వటపత్రమ్ములవయి
తేలి తేలి పడు నడుగు లవే!
పూలతీవ పొదరింట్లు మాటుగా
పొంచి చూచు శిఖిపింఛ మదే!
తరువు తరువు కడ డాగి డాగి న
న్నరయు కన్నుగవ మురుపు లవే!
మురిసి మురిసి నా వెనుక దరిసి కను
మూయు చివురు కెంగేళు లివే!

# వి భా వ రి

ఓ విభావరీ ! ఓహో విభావరీ !
నీహార హీర నీలాంబర
ధారిణీ, మనోహారిణి !! ఓ విభావరి !

నీ చంచల చేలాంచల
నిభృతస్వప్నసీమలలో
ఏలా భయచ్ఛాయాజాల
మేలా సౌఖ్యరోచిర్జ్వల !! ఓ విభావరి !

సంతత శాంతతరంగిణి
మదభరయువకురంగిణి
ఏలా యలసగమనమ్ము
ఏలా నవవిలసనమ్ము !! ఓ విభావరి !

ధరణీతలచంద్రశిలా
తరళమంటపమున నిలిచి
యుగములుగ పరిభ్రమింతు
వగమ్యుడౌ యెవని వలచి !!
ఓ విభావరీ ! ఓహో విభావరీ !

# నళిని - పవనుడు

ఆమె:—కుంజవని మధుర మంజులగానము
మందపవనుడా నీదేగా

అతను:—మంజులగీతి మరందపోషితము
నళినీ నీదే గాదా !

ఆమె:—మృదులగీతముల మదరావములో
హృది పొంగింతువు పవనా !

అతను:—నీ మృదులపత్రములమదమాధురిలో
మైమరపింతువు నళినీ !

ఆమె:—ప్రణయ సరసి తేలుదమా

అతను:—ప్రణవ మరసి సోలుదమా

ఆమె:—యువకవరా !

అతను:—సుమరమణీ !

ఆమె:—అనిలసఖా !

అతను:—కమలినీ ప్రియసఖి !

ఇద్దరు:—అనురాగాంబుధి నలరుదమా
ఆనందాంబుధి మునుగుదమా

విరహిణీ దృగంచలాల
తరళాశ్రు కణాలలో
మెరసినపుడె చెలిమికలలు
విరియ ధన్య నౌదునోయి !! స్వామీ !!

లోకావలి పెన్నిద్దురలో తోగిన వెనుక
వెంజీకటి కవ్వాలవెలిగే నీకాంతి సుధా స్రవంతిలో
కరంగి పోదునోయి !! స్వామీ !!

# స్వప్న జగతి

స్వప్నజగతిలో ఛాయావీణా
సమదశ్రుతు లెవో సాగునవే !! స్వప్నజగతిలో !!

అంతరాళమున వింతరంగు లెవో
అలసాలసములై అలమునవే !
రెప్పపాటులో కోటికోటిశశి
రేఖలాశలకు యేగునవే !! స్వప్నజగతిలో !!

కల్పనాకృతులు కథలు కథలుగా
కదలి మెదలి చెలరేగునవే !
జన్మజన్మగతస్నేహమాధురులు
ఝురులు ఝురులుగా మూగునవే !! స్వప్నజగతిలో !!

జాడజాడలుగ జరిగిపోవు నా
నీడల నా ప్రియు డేడో !
గురుతు వైచికొని, కన్ను మూయగనె
జరిగిపోవు నే నీడో !! స్వప్నజగతిలో !!

# జాజి - తుమ్మెద

చల్లగాలిలో పూలతోటలో కొల్లలైన వలపులలో
కన్ను విచ్చి చిరునవ్వు నవ్వినది సన్నజాజిపూ వొకటి !!
దారినిబోయే తుమ్మెదబాలుడు దగ్గరగా నిలిచాడు !
సన్నజాజివిరికన్నె చూపులో తనచూపులు కలిపాడు !!
సన్నజాజివిరికన్నె యెడదలో తేనెజల్లు కురిసింది !
తుమ్మెదబాలుని కన్నులలోపల వానవిల్లు మెరిసింది !!
తుమ్మెదబాలుడు ఝుమ్మఝు మ్మనుచు రమ్మర మ్మనగసాగె !
సన్నజాజివిరికన్నె సిగ్గుతో చిగురుజొంపమున డాగె !!
తుమ్మెదబాలుడు నమ్మకమునకై తోటయే సాక్షిగాను
బాసల నెన్నో చేసినాడు విరిబాలకు మోదముగాను !!
జాజివిరివలపు తేనెల వానల జడులలోన తడిశాడు !
జాజిపూవుపై మోజుతోడనే రోజు లెన్నో గడిపాడు !!

# *ఆశ్వాసనము

శతపత్రసుందరీ! అతిలోక
సౌందర్య బంధురీ!
యౌవనసరసి - మదభరిత
జీవితలావణ్యము లొరసి
ధగధగ మెరసి - శతమృదుల
దళములుగా విరిసి
వెలసితే, చెలిమి కలలలో
అలసితే, సొలసితే,
తరుణారుణ నవరాగమంజరీ!
భ్రమరకంఠకలగానవాహినీ!
భంగసార్ద్రహృదయాంజలీ!
సుందరీ! ఓ సుందరీ!

*రాగల తొమ్మిది గేయాలు శతపత్రసుందరి నాటికనుండి.

# అస్తమయము

ఇనుడు కొండ దిగెనా అయ్యో,
దిగెనా అయ్యో, దిగెనా ?
నా వలపుల చేకొనకుండ,
నా పిలుపులనే వినకుండ, కొండ
దిగెనా అయ్యో, దిగెనా ?
యుగయుగాల దినదినంపుమోసము
ఓర్వగలనో యెన్నినాళ్లో యీగతి
నగవుపాలుకాదె నాదు జీవిక
కనులు తెరచి కలువ చూచెనే ! !
ఇనుడు కొండ దిగెనా అయ్యో,
దిగెనా అయ్యో, దిగెనా ?

# కీచురాలు

హాయి హాయి హాయి
రేయివచ్చెనోయి!
తెరలు తెరలుగాగ యిరులవే
పారలి వచ్చెనోయి!!
కలుగు కలుగు తలుపు తెరవరే
తలలు పైకి చాపరే!!
కీచు కీచు మంటు రెక్కలూ
రాచి రాచి పాడరే
కాలు తీసి కాలువేయరే
గంతు వేసి తేలరే
ఎరక పరచి యిరులలోపల
ఎగిరి యెగిరి పోవరే!!

# విరహిణి

తిరిగి, తిరిగి, తిరిగి యేలనోయి
ఈ రేయి యేలనోయి!!
మరిగి మరిగి మరిగి తరుగు
నాదు నెడదపైని తెరగ! తిరిగి తిరిగి!

పడమట కను నిలిపి నిలిపి
బడలి దిగులు వడుదు,
సడలి ప్రీలునో, నా
ఆశామృణాలహారావళి! తిరిగి తిరిగి!

సురిగిపోయె లోన, తేనె
పెరలు,తరుగ దిక దాహము
ఒరగి, ఒరగి, ఒరగి, కలల
బరువు నిదురలోనపడుదు! తిరిగి తిరిగి!

# జాబిల్లి

జాబిల్లి వస్తున్నాడు
వెన్నెల్లు కాస్తున్నాడు
కన్నెత్తి చూస్తున్నారా !!
తూర్పుకొండపైనే
ప్రాకి వస్తున్నాడు
చూస్తున్నారా ?
ఓ జక్కవపులుగుల్లారా !
ఓ చక్కనిచుక్కల్లారా! రారే! రారేమర్రా!
తేలుదామా వెన్నెలల
వ్రాలుదామా కొలనుతిన్నెలల
విరాళి పోలే పద్మరాణి
ఇదే పోయి చూదామా !!

# జోల

జోజో సఖి! నిదురపోవే సఖి!

నూరు రేకుకన్ను లొక్కసారి మూసి హాయి!

తేరు తేటనీటి యలల డోల నూయ లూగవోయి!

జోజో సఖి! నిదురపోవే సఖి!!

నిదురలోన నీ యాశలు కదలి రెక్క లొదవునోయి

విదలించిన రెక్క లెగసి చదల తేలి మెదలు హాయి!!

జోజో సఖి! నిదురపోవే సఖి!

వెలుగు తెరల చిమ్ముకొనుచు మబ్బు తెరల చీల్చుకొనుచు

కలలలోకములను కోరికల చెలువల కలిసియాడు

జోజో సఖి! నిదురపోవే సఖి!

# స్వప్నలోకము

స్వప్నలోకము! స్వప్నలోకము!!
రంగురంగు వెల్గుతెరల చిత్రలోకము!!
పొంగి పొరలు వెన్నెలలో, చుక్కలసాగరములో,
ప్రోవు లౌచు తావు లౌచు, చేరి చేరి చెదరిపోవు!!
ఫలియించని ప్రేమలో తరించని మాధురులో
పండి విరిసి అలసిన నీ గుండియ చల్లగా నిమురు
స్వప్నలోకము! స్వప్నలోకము!!
రంగురంగు వెల్గుతెరల చిత్రలోకము!!

# గ గ న యా న ము

సరసి విడిచి యెగయుదునో !
నే నెగయుదునో! నే నెగయుదునో !
సరస సరస వెన్నెలతరగలు న న్నొరయ !
పై మి న్నరయ !

నూరు రేకులూ తేలితేలి తెరచాపలై పైకి సాగు !
తొడిమ రేకు లే గాలిని కిందికి వడివడి త్రోయగ సాగు !!
వెన్నెల ప్రోవులు క్రిందికి క్రిందికి
క్రొన్నన తావులు పైపైకి!
తారామండలి క్రిందికి క్రిందికి
నూరు రేకులూ పైపైకి!—
పైపైకి! పైపైకి! పైపైకి! పైపైకి!

# మేలుకొలుపు

మేలుకొనవె శతపత్రా!
శతపత్రా! శతపత్రా!
అరుణ తరుణ కోమలగాత్రా!
అలసమీలితాయతనేత్రా!
ఉదయకాంతు లూదవెను కనవో!
హృదిని విరిసి మధువు లొలుకవో!
శతపత్రా! శతపత్రా!
కుక్కుటతతి మేల్కొలుపు లవే!
మధుపమాగధుల పిలుపు లవే!
సారససౌధప్రాంగణసీమను
స్వర్ణపతాకల తళుకు లవే!
మేలుకొనవె శతపత్రా!
శతపత్రా! శతపత్రా!

# రొద

రొదసేయకె తుమ్మెదా, రేగి
రొదసేయకె తుమ్మెదా !!
చెలిని నిదురింపగా నీయదే, నీ రొదా !
రొదసేయకె తుమ్మెదా !!
విరివలపని భ్రమయకే
పొందామర తళుకని మురియకే
చెలియూపిరి తీపికి సొలయకే అలయకే!! రొదసేయకే!!
హాయిగ నీ అరమూయు కనులలో
ఆడు పాపలే నీ చెలులా !
తీయనైన పెదవి యొఱుపులో
తేరు తేనెలే నీ కలలా !! రొదసేయకే !!
వింజామర వేయవె—చల్లని
విరిగందము భరియించు రెక్కలతో
వింజామర వేయవె !
కంజానన యిప్పు డిప్పుడే ఆ
కలల లోకమున చెలగెడివేళ !! రొదసేయకే !!

# కొండకోన

కొండకోనలో కుంకుమమ్ము
శతకోటిరాశులై తూలె!
సెలయేటిపాయలై మేటిచాయలై
పాటలీకుసుమవాటిరై!! కొండకోనలో!

అవనితలమునకు, ఆకసమ్మునకు
అందమౌ కెంపుబాటమై
నవగంధలహరి, నా
నందఝురు లలము
మందపవనముల పాటమై!! కొండకోనలో!

పొదరు పొదరునా గుబురు గుబురునా
కదలు పులుగుగమి కూతలై
ఆలమందలను తోలుకొనెడు గో
పాలుని వేణువు మ్రోతలై
మధురీతులై మంజులగీతులై కొండకోనలో!

# సెలయేరు

కవి:—రా, సెలయేరా! రా, సెలయేరా!!

జలజల ప్రవహించు సెలయేరా, సెలయేరా!!

కలకల నవ్వుచు చిందుచు

కులికే కన్నెపిల్లవలె రా, సెలయేరా!!

రా, సెలయేరా! బిరాన, రా సెలయేరా!!

సెలయేరు:—వస్తాను నేను వస్తాను, న

ర్తిస్తూ బిరాన వస్తాను!

తొలిమెరపు నడక ఒయ్యారంతో

తెలిమంచు చీర సింగారంతో

నా కలల తేనియలయూటలతో చిరు

యెడద రొదచేయు పాటలతో

వడవడ వణకించే మంచుశిలల

అడుగున తడబడుతూ వస్తాను!

తళతళ మెరయించే గులకరాల

గలగల పరువులతో వస్తాను!

# ప్రతిశ్రుతి!

ఓహో ప్రతిశ్రుతీ! ఓహో ప్రతిశ్రుతీ!!
ఏటివార తోటలో తాటితోపు తలలనూపు
గాలి తీయ పాటలో
ఆకుపచ్చ చేలవెన్ను లల్లలాడు ఆటలో
నీపాటె వింటునే! నీమాటె వింటునే!
ఓహో ప్రతిశ్రుతీ! ఓహో ప్రతిశ్రుతీ!
పవలురేలు కోనలలో పాతకోట బురుజుపై
పలికించు నగారలో
దెసలు మారుమ్రోయ మ్రోగు దేవళంపుగంటలో
నీపాటె వింటునే! నీమాటె వింటునే!
ఓహో ప్రతిశ్రుతీ! ఓహో ప్రతిశ్రుతీ!
దారికాని దారిలో ఆకసమ్ము నంటి నిల్చు
కొండల నడిలో లోయలో
ఒంటరైన బాటసారి ఓ యన ఓహో యన
నీపాటె వింటునే! నీమాటె వింటునే!
ఓహో ప్రతిశ్రుతీ! ఓహో ప్రతిశ్రుతీ!

కృ:—కోప మేల రాధా! దయ
చూప వేల నాపై!
రా:—మోసగాడవోయీ! పలు
బాస లేల చాలునోయి!
కృ:—బాధ కలుగు చాల! అప
రాధ మేదొ సైప వేల?
రా:—అపుడె మోసగించి, తిరిగి
యపుడె సైప మందువోయి!
ఓరి మెంతవరకో, నీ
నేర మీవె తెలియలేవా!
కృ:—ప్రాణసఖుడ గాన, నా
యాన, నను క్షమింపవేని!
నేర మేదొ తెలియా, నే
నేరనైతి చెలియా!
రా:—రాతిగుండె నీది! ఎన్ని
రాత్రు లయ్యె నన్ను వీడి

వా_ర్తయైన లేదు—నాడు
ఆ_ర్తి నీకు తెలియలేదా!

కృ:—కలత వీడు చెలియ! నీ
వలపు దక్క వేరు తెలియ!
రాధికాప్రియుండె, యీ
మాధవుడని విశ్వ మెరుగు!

రా:—కల్ల లెన్ని పల్కినావో?

కృ:—ప్రతిన సేతు నమ్మలేవా?

రా:—ప్రతిన లెన్ని సల్పినావో!

కృ:—ప్రాణసఖి పదములాన!
వదలను క్షమియించుదాక!

రా:—మాధవ! అపరాధము నీ
రాధను నీవే క్షమించు!

కృ:—రాధారాణీ!

రా:—మాధవదేవా!

ఇద్దరు:—రాధామాధవప్రేమా
రామము బృందావనము
రాసక్రీడామనోజ్ఞ.
ధామము బృందావనము!

# వెన్నెలరేయి

తార: కన్నులకింపౌ వెన్నెలరేయి
వన్నెకాడ వెవరోయి!
చేసన్న సేతు వెవరోయి

చంద్రు: అందమైన యీ చంద్రనౌకలో
నావికుండనే చెలియా!
నీ ప్రేమికుండనే చెలియా!

తార: నున్నని చెక్కిలి వెన్నెలకన్నా
మిన్నయై మెరసె నేలా!
నా కన్నులిటు విరిసె నేలా!

చంద్రు: వెలుగుముద్దలో వెన్నపూసతో
మలచినారు నను చెలియా!
నిను వలచినాడనే చెలియా!

తార: అందమైన నీ చంద్రనౌకలో
ఎందుకుతిరుగుదువోయీ!

చంద్రు: చుక్కలలోపల
సుందరివా నీ
పొందుకోసమే చెలియా!

తార: నన్ను చేరగా
తెన్ను నీ కెవరు
తెలిపినారోయి సఖుడా!

చంద్రు: మినుకు మినుక నీ
మెరయు నీ మూపె
దారిచూపెనే చెలియా!

తార: నన్ను చేరగా
ఎన్ని నాళ్లుగా
తిరుగుచుంటివో సఖుడా!

చంద్రు: యుగయుగాలుగా
పగలు రే యనక
పయన మైతినే చెలియా!

తార: నావలోకి రా
నీవో, నా కింత
తావు చూపవో సఖుడా!

చంద్రు:　　　　నావ నీదె గాదా ! చెలియా
నావ నీదె గాదా !
నీవె నడపవే చెలియా ! నావ
నీవె నడపవె చెలియా !

ఇద్దరు:　　కన్నుల కింపౌ వెన్నెలరేయి
అందమైన మన చంద్రనౌకలో

చంద్రు:　　　　ఒరగిపోదమా సకియా !
తార:　　　　• కరగిపోదమా సఖుడా !
ఇద్దరు:　　కన్నుల కింపౌ వెన్నెలరేయి !!

# మబ్బుకన్నె - మలయపవనుడు

మబ్బు: మలయపవనా! మలయపవనా!
కొండదాపుననుండి లేచి
కొంటెచూపులు చూచి చూచి
గుండెలోపలి కోర్కె లేవో
గొంతుముడిలో కదలియాడగ
ఏల యీలలు పాడుదోయి!
ఎవరికై నడయాడుదోయి
మలయపవనా! మలయపవనా!

మలయ: మబ్బుకన్నే! మబ్బుకన్నే!
నీదు వలపుల జడులకోసము
నీలిదారుల కొండకోనల
నీటిచాలుల తేలిపోతూ
నింగి నీలపుచాందినీకడ
నిలిచిచూచెదనే - ఓ మబ్బుకన్నే!

మబ్బు: తోటతోటల బాటబాటల
పేటికెరడుల పూలకన్నెలు
తేనెసోనల కాన్క లీయరో!
నా దరికి రానేల నోయీ!
మలయపవనా! మలయపవనా!

మలయ: మబ్బుకన్నె! మబ్బుకన్నె!
కానుకలుగ గడించినాడను
తీయదనముల వెన్నొ బరువై
పోయె - చల్లగ నేద తేరగ
నీ తుషారము కోరినానో!
మబ్బుకన్నె! మబ్బుకన్నె!

మబ్బు: నా తుషారపు వజ్రహారము
నాదు మెరపుల వలపు జడులను
నీకు కానుక లిత్తు నంచును
నీకు తెలియున? నీకు తెలియున!
మలయపవనా! మలయపవనా!

మలయ: మబ్బుకన్నె! మబ్బుకన్నె!
నాకు తెలియును! నాకు తెలియును!

నిలిచి నీ నీలాల మేడ
సిలిదారుల నొడలు మరచి
నీ వెవరి నెదురుచూచెదవో !
నన్నే కాదా!! నన్నే కాదా !
మబ్బుకన్నె ! మబ్బుకన్నె !

# దినాంతము

దినాంతమ్ము కాగా వనాంతమ్ములందు
ప్రశాంతారుణచ్ఛాయ లంతర్హితాలై
దిశాంతావకాశమ్ము తాకెన్ తమమ్ము
నిశాకేశపాశమ్ము ప్రాకెన్ నభమ్ము

# అన్వేషణ

యమునాతీరవనములో ప్రముదిత
శ్యామల జలధరఖేల!
మధుర మధుర మృదుమురళీలోలన
గోపికామోహనలీల!! యమునా!!

మదులకోరికలు మెదల
బెదరుచూపులే కదల
వెదకుదు రేమది నదిలో
జలముల శ్యామలతనువో!! యమునా!!

నీట ముసుగు వసనాలా
నింగి తేలు జలదాలా?
తొంగిచూచు నయనాలో
వంగి ప్రాకు చరణాలో!! యమునా!!

# మన మిద్దరమే

ఇద్దరమే, మన
   మిద్దరమే !

నీలిబైలి లోయలలో
పాలవెల్లి పాయలలో
చేయి చేయి కలిపి, హాయి
హాయి నొక్కటై పోదము !
ఇద్దరమే, మన
   మిద్దరమే !

పాలవెల్లి బిరులు దాటి
పాలరాతి గవను దాటి
ఆలోకపు పొలిమేరల
తేలి ఒక్కటై పోదము !
ఇద్దరమే, మన
   మిద్దరమే !

వలపుటుయ్యాలలలో
కలిసి ఒకటౌదమా !
ఇద్దరమే, మన
మిద్దరమే !

# ఎందుకో!

ఎందుకో! పున్నమ!
ఎందుకో! వెన్నెల!
ఎందుకో ఈ జగ
మ్మంత నే డీహాయి!!　　ఎందుకో!!

ఇందుకా నా హృదయ
మెగసి పాడేందుకా!
విశ్వహృదయమ్ముతో
ఐక్య మందేందుకా!　　ఇందుకా!!

అమృతవీణాహృదయ
గలిత దివ్యశ్రుతులై
ఆశాశ లెల్ల బ్ర
హ్మాండాలు నిండినవి!!
నా గళమ్మును వీడు
కళ్యాణిరాగమ్ము
నా వీణపై లోక
కళ్యాణమా నేడు!!　　ఇందుకా!!

ఇందుకా నాహృదయ
మెగసి పాడేందుకా !
విశ్వహృదయమ్ముతో
ఐక్య మందేందుకా ! ఇందుకా !!
ఎందుకో ఈ జగ
మ్మంత నే డీహాయి ! ఇందుకా !!

# మెట్లవరుసలు

మెట్లవరుసలు మెట్లవరుసలు!
మెట్లవరుసలు మెట్లవరుసలు!
గగనసీమలు కాలపరిధులు
గడచిపోయే మెట్లవరుసలు!
జీవితమునకు మరణమునకూ
ఈవలావల కదలు వరుసలు!
మెట్లవరుసలు మెట్లవరుసలు!
మెట్లవరుసలు మెట్లవరుసలు!
కుడి యెడమలే కానరాని
తుదిమొదళ్ళే తోచబోని
మెట్లవరుసలు మెట్లవరుసలు!
స్వప్నమధువుల జడులలోపల
స్వాంతమున జ్ఞాపకపుపొరలు!
పొరలలోపల తెరలు తెరలుగ
పూర్వజన్మ ప్రేమకథలు!!
మెట్లవరుసలు మెట్లవరుసలు!
మెట్లవరుసలు మెట్లవరుసలు!

# జ్వాలాతోరణం

జ్వాలాతోరణం !
నీలాకాశ ఫాలతలాన తేలే
జ్వాలాతోరణం !!
దశదిశలను కాంతి
వెలుగుల కావల పలవించు అశాంతి
కలకలలాడే మృదులాననములపై
తళతళతళ మను మధురభ్రాంతి !
జ్వాలాతోరణం !!
తెరలు తెరలుగా తరలెడు పొగలు
పురులు పురులుగా విరియుచు
వెలిగెడు దీపపుసెగలు !
అరులు వెలికి పరువు లిడగ
ఇరుల తరిమి తరిమి వెలుగు !
జ్వాలాతోరణం !
నీలాకాశఫాలతలాన తేలే
జ్వాలాతోరణం !!

౨. దిబ్బూ దిబ్బూ దీపావళి
మళ్లీ వచ్చే నాగులచవితి !!
మిన్ను మన్ను కలకల కలకల మని
మెరసి వెలుగు వెన్నమతాబా వెలుగు రవ్వలూ
ఓహో ! వెలుగు రవ్వలూ !! దిబ్బూ !!
కన్ను చెదర మిలమిల మిలమిల మని
మిన్ను లలము చుక్కనవ్వులో కాకరపువ్వులూ
ఓహో ! కాకరపువ్వులూ ! దిబ్బూ !!
సన్నతాచు చరచర చరచరవలె
మిన్ను దూసి వెలుగు తీరులో తారాజువ్వలూ
ఓహో ! తారాజువ్వలూ ! దిబ్బూ !!

3. కను డదే - కను డదే
కడప గడపను ప్రమిదవెలుగులు
కను డదే కను డదే
కడల నడలెడు ఇరులపరుగులు !
కడప గడపను ప్రమిదవెలుగులు
ఘనఘనా ! ఘనాఘనా !
ఘనఘన మనుచు దిశలు పలికెను !
ధనధన ధనధనా !
ధనధన మనుచు సిరుల నొలికెను
ఘనఘన మనుచు దిశలు పలికెను

# జైత్రయాత్ర

కేల కేల గోగు కాగడాలతో
విశ్వ మెల్ల వెలుగు నగుమొగాలతో
కడప గడప గడచి రారే!
వీథి వీథి వెడలి రారే!!

కేల కేల బాణసంచాలతో
దిక్కు లెల్ల ప్రేలు పటాకీలతో
నడుముకట్టి నడచి రారే!
బడలిక నేమరచి రారే!!

మదమత్సరకోపమ్ముల
అదిమి వేయ నొకేసారి
ప్రగతి నడ్డు దానవాళి
పగ లడంప నొకేసారి
రారె రారె యువకులార!
రారె రారె యువతులార!!

దీపావళి వెలుగు చూపి
తిరుగులేని ప్రేమ చూపి
శాంత్యస్త్రము సంధించుక
సమరసాప్తి కొాకేసారి

రారె రారె యువకులార !
రారె రారె యువతులార !!

కేల కేల గోగు కాగడాలతో
విశ్వ మెల్ల వెలుగు నగుమొగాలతో !!

# ప్రతిజ్ఞ

ప్రతిహస్తము కాగడా ధరిస్తాము!
ప్రతివత్సరమ్ము ప్రతిజ్ఞ చేస్తాము!!

గోగుల కొమ్మల రెమ్మల కొసలందు, మా
ప్రతిజ్ఞలే జ్యోతులుగా వెలుగొందు!!

చెరకువిండ్ల చివరల్లో దీపికలై మా
ఆశయములె మెరయునుగా మాధుర్యంలై !!

అర్కసహస్రపు కిరణావళిపోలు! మా
కోర్కెలవెల్లుల గోగుకాగడాలు!!

దేవత్వమునకు విజయోత్సవ మిదియే
దానవత్వమున కపజయ తరుణ మిదే!!

## దీపావళి

ఇంటింటీ ముంగిటా ఒలికేటి నవ్వులే
దీపావళీ ఓహో దీపావళీ !

కంటికాటుకలోన మెరపూలపువ్వులే
దీపావళీ ఓహో దీపావళీ !

ఒడినిండా నగలుండే ఒయ్యారినడకలే
దీపావళీ ఓహో దీపావళీ !

జడుపు గిడుపూలేని సంబరాల ఒడుపులే
దీపావళీ ఓహో దీపావళీ !

చెడుగంతా చీకట్లయి మంచంతా వెల్తురయే
దీపావళీ ఓహో దీపావళీ !

చెడుగూ చీకటి పోయీ మంచీ వెలుగూ నిలిచే
దీపావళీ ఓహో దీపావళీ !

# *అంజలి

అంజ లిదే పుష్పాంజ లిదే
అనంగదేవ! ప్రణయాధిదేవతా!
నీ శుభాగమనలీల! మా మధురాశాడోలా!!
చివురుపతాకాలు! కోకిల బాకాలు!
వలపుల పవనాలు! చిలుక విమానాలు!
ప్రసూన మధురతలై! ప్రణయజీవలతలై!
భువి నామని దిగిన వనాలు! నవమనోజ్ఞసునందనాలు!
అంజ లిదే! పుష్పాంజ లిదే!
ఓహో! ఓహో! నవవసంతసఖ! మన్మథా!
ఓహో! ఓహో! కుసుమసాయక! మధువ్యథా!

---

* రాబోవు అయిదూ అవంతిసుందరినాటికాగీతాలు.

## రాజహంస !

రావో రాజహంసమా !
ఠీవియైన నడకలతో ! ! రావో ! !
తెలిరెక్కల అంచులే,
మెరయు పైడిమించులై
కులుకుచు మెడచాపుచు
తరణి వోచు తేలవో !! రావో !!
జనవాంతర సౌహృదాల
సందేశము లిత్తువో
ఈమృణాలహారము నీ
పాదములకు తోరమోయి !!
రావో రాజహంసమా !
ఠీవియైన నీడలతో !!

*　　*　　*

రాజహంసకులతిలకా ! సెలవోయీ సెలవోయీ !!
ఏ జన్మపుదో నీ స్నేహస్మృతి !
మా కేళీవని చేరితివా !! రాజహంసకులతిలకా !
మాతృదేవి పిలుపున పోవుదు నో
మదహంసా మన్నింతువుగా ! రాజహంసకులతిలకా !

*　　*　　*

# ఇంద్రజాలగీతాలు

౧ రావోయీ వైనతేయా
కాలగండభేరుండ ! గరుడా ! విషనాగహరా !!
కొండశిఖరినుండి లేచీ, నిండుగ రెక్కలను చాచీ,
అశనిపాత మట్లు భూమి ఆకసము ప్రతిధ్వనింప
కాళరాత్రి శిరోజాల పాయగా,
నిబిడఘనాఘనముల పెనుచాయగా,
రావోయీ వైనతేయా !!

౨ హ్రాం హ్రీం, హ్రూం హ్రైం
దిగు ! దిగు ! మహేంద్రజాలీ ! మాయామహాంకాళీ !
కనులకు ఇరులతెరే మాయాజాలము !
ఇరులకు వెలుగుపారే మాయాజాలము !
మనసుకు మరపుతెరే ఇంద్రజాలము ! దిగు ! దిగు !
జల్లుజల్లులై సభికుల కన్నుల చల్లవే ! చల్లవే !
చల్లవె మాయాకిరణాలు !
అల్లవే ! అల్లవే !...అల్లవె, అల్లవెకాంతివాహినుల
కదిలే ఛాయారూపాలు !

# రమ్యాణివీక్ష్య

స్మరియింతురుగా !

స్మరియింతురుగా ! !

తెలియని దే తొలిజన్మనో

హృదిలో నెలకొన్న వలపులు !

మదిలో ఒదిగిన తీయని తలపులు !

స్మరియింతురుగా !

స్మరియింతురుగా ! !

కన్నారో రమ్యవస్తువులను

విన్నారో మధురగీతములను

పరువులువారే యెడదలు

బ్రహ్మాండము నిండగ

స్మరియింతురుగా !

స్మరియింతురుగా ! !

# తొలి పిలుపు

ఎవరు పిలిచినారో నన్నెవరు పిలిచినారో !!

భవసాగరమున ప్రణయతరణిపై

పవలురేలుగా పయనించే నన్నెవరు పిలిచినారో !!

కలకబారె మది, పులకలొదవె నెద,

మరపుతెరలు విడి, తలపులు పొంగగ నెవరు పిలిచినారో

పిన్నవయసులో కన్నస్వప్నములె

కలకంఠస్వనకమ్రమధువుగా నెవరు పిలిచినారో !!

---

వచ్చే ఆరుపాటలు శిలప్పదికారంలోని కానల్‌వరిప్పాటు అనగా 'కడలి దరిపాట' అను కోవలన్ కథను అనుసరించి.

# ప్రియోక్తి

సడలనీకు కాంచీదామము! నా
ఎడదలోన వెన్నెల లొలుకనీ!!
వేయివలవంటి కనులతో నా
యెడద కడలిలోతులలో, అసువుల
హారియింతువుగా నీ సొగసుతో!!
వింటివంటి కనుబొమల చలనముల
కంటబడిన నా జీవమ్ముల నిటు
హారియింతువుగా నీ సొగసుతో!!
సడలనీకు కాంచీదామము! నా
యెడదలోన వెన్నెల లొలుకనీ!

# చెలివలపు

తీయతీయగా చెలి వలపించినదోయీ సఖుడా!
తోటలోని నెత్తావి తెరలలో
బాటపైన అరవాడు విరులలో
తేటతేనెలా మాటలతో - ఎడ
బాటులో వెరగుబాటులో నిటులె - తీయతీయగా!
కడలియలలు విరిగిపడు నాటలో,
ముడుగు నిసుకపొర లూడు పాటలో
అణచు నగవులో పులక లెగయగా
తాను కెరలి తిరుగాడు నరులలో
తీయతీయగా చెలివలపించినదోయీ సఖుడా!

# చెలిసొగసు, వలపు

తెలియునా చెలియ సొగసు వలపుతీరు లో సఖా !

విరిశరాలు, మరులు సోగులు, చిరుతమీలు, కారుమొగిలు

తరచి చూచి సకియమోము ధాత మలచినాడోయి

—తెలియునా !

రాగిలువాడినేత్రాలు మ్రోగుకంకణాలు

ఆగియాగి తిరుగ యువకహృదులు మరుగునోయి !

—తెలియునా !

శారదపూర్ణిమను చెలగు జాబిలి వెలుగోయి !

పాముకాటు వెరచి యిలకు పరచివచ్చెనోయి !

—తెలియునా !

# వాగ్భంగము

ఇటు లౌ నని యెటు లెరుగుదుము !
ఏటి ప్రియుడో ! ఏటి ప్రియుండో !
తారహారములకు బదులుగా
తలలో వాడినపువ్వు చాలని
వలపు లొలుక పలికిన ప్రియుడే
ఏటి ప్రియుడో! ఏటి ప్రియుండో !
ఇటు లౌ నని యెటు లెరుగుదుము !
బాసతప్పి మోసకారియై
ఆసల నడియాసల జేసి
కల్లగాథలను వినిపించెనె
ఏటి ప్రియుడో ! ఏటి ప్రియుండో !
ఇటు లౌ నని యెటు లెరుగుదుము !

# కావేరి!

కావేరీ! ఓ కావేరీ!
నీ వెంత పుణ్యవతివమ్మ!
నీ వేమి యీసుపడవమ్మా!
వెండిగోడుగు వలివెన్నెలలో, నృప
దండము మెరసే వన్నెలలో, నీ
కేటిప్రియుడో! చోళుడు చేపట్టెను
వీటికొమ్మ గంగమ్మ!
నీ వేమి యీసుపడవమ్మ!
నీ వెంత పుణ్యవతివమ్మా!
నీ కనుల మీను లాకలిని చెంద
వరుణింపవమ్మ కావేరీ!
నాగేటి మంతనము పాట, మేటి
సెలయేటి నీటిరొద పాట, నీ
నీట క్రుంకులిడువారి మంతరము
పాట లోలసి మెలయంగ
నీ విభునికీర్తి వెలయంగ వినుచు

ప్రవహింతువమ్మ కావేరి !
కావేరి ! ఓ కావేరి !
నీ విభుడు నిన్నె ప్రేమించునమ్మ !
నీ వెంత పుణ్యవతివమ్మ !
ముద మగు తుమ్మెదరొదలో కమ్మని
పూవుల ప్రోవులు మెదల,
కదలియాడు మీననయనాలతో
పొదరు, గుబురు, బాట, తోట, చూచుచు,
పరువు లిడుదువు గదమ్మ !
నీ విభుడు నిన్నె ప్రేమించునమ్మ
నీ వెంత పుణ్యవతివమ్మా ! !
కావేరి ! ఓ కావేరి !

# సుమసౌరభం

ఈ సుమసౌరభ మే సురపారిజాతకళికదో!
పెరటిలోని కల్పలతావరసుమమునె మరపించెను!!
ఏకాకి యెడద నే తారక పలుకరించెనో!
రాకేందుబింబ మే మబ్బుపిరుంద నిల్చెనో ఈసుమ!!

అగ్నిమిత్రు డౌ వాయువు నిట్టూర్పుల వలెనె
అగ్నిమిత్రరాజు హృదయ మాందోళితమాయె!
ఈసుమ!!

---

వచ్చే 7 పాటలు మాళవికనాటకముకొరకు వ్రాసినవి.

# ఏకాంతజీవిక

ఎద గాయపడిపోయె
సోదతోడ రాదతోడ !!

ఏకాంతజీవనము నే గడుపగాలేను
ఈవియోగము నింక నే నటింపగలేను!! ఎదగాయపడి!!

నా గోడు విని సుంత నన్నాదరింపంగ
ఏనెచ్చెలియు లేక ఏనెయ్యుడును లేడు!! ఎదగాయపడి!!

# నాట్యపరీక్ష

నర్తించు నవె మయూరములు!
ఓహో యనుచు ఓహోహో యను
కేకారవముల క్రిందుమీఁ దగుచు! నర్తించునవె!!
ధనంధనమ్మను మృదంగధ్వని
ఝుళం ఝుళం మ్మనెడు నూపురస్వని
రాచనగరులో నాట్యాచార్యుల
నృత్యగీతవాద్య ఘోషల
మేఘావృతమౌ వర్ష ఋతువుగ
భ్రమించినవో మదించినవో! నర్తించునవె!!

# ఎందుకో!

ఎందుకో - హృదయమా!
అందని ఫలమునకై ఆశలు!!

అదరు నిదేలా వామనయనము
అందిచ్చునో అనుకొనని శుభాలు
ఎందుకో - హృదయమా!!

పురుష శేఖరుని కంటిని నేడు
వలపు విరియు చేనాడో కన్నుల
కరవు తీరు చేనాడో
ఎందుకో - హృదయమా!!

తెలిసికొనగలేవా దేవా! నీ
దివ్యచరణములె శరణము నాకు!
ఎందుకో హృదయమా!
అందని ఫలమునకై ఆశలు!!

# లాక్షా చిత్రణ

కదలకుమా చెలీ! కదలకుమా చెలీ!
కదలిన అలదెదు లత్తుక
చెదరి తూలు క్రింద మీద కదలకు॥

లత్తుక నలదినపాదము
నొత్తిన కెంజాయ లరసి
మెత్తని విరిదమ్మిరేకు
యెత్తదు తల లజ్జచేత కదలకు॥

అరుణపదము తాకినంత
మొరడు కూడ చివురింపదొ
కరకురాతి యెడదకూడ
కరగి యేరులై పారదొ కదలకు॥

# దోహదము

పరపుము పరపుము...చెలీ !
తరువున నీ అరుణపాదకాంతుల
పరపుము పరపుము చెలీ !
వలచుము వలచుము చెలీ ! ...నీదు మది
కదలు కోరికలవిరులు ఫలింపగ
వలచుము వలచుము చెలీ !
చరచుము చరచుము చెలీ !...నీదు మృదు
పదముల సీతరు వదరి విరియఁగా
చరచుము చరచుము చెలీ !

## ఎడబాపు

మనోరమణుడె రాగ
కనులార కాంచనైతి!!

పిలుపైన వినగనైతి
మనసైన తెలుపనైతి!!

నా తను వేలో తూలి
నా మానసాంచలాల
మారుత చాలిత సుమలతయో
విచలిత విద్యుల్లతయో
రెపరెపలాడినవి, నా
ప్రియు నెడబాపినవి!!
మనోరమణుడె రాగ
కనులార కాంచనైతి!!

# అశోకదోహదము

ఎత్తె నదే మాళవిక !
లత్తుకపాద మశోకము నొత్తగ
నెత్తె నదే మాళవిక !!
వ్రాలె నదే మాళవిక !
సోలుచు చెలి వకుళావళి కౌగిలి
వ్రాలె నదే మాళవిక !!
తాకె నదే మాళవిక !
అశోకము తన మృదుపదమున నదరగ
తాకె నదే మాళవిక !!
పూచె నహో - అశోక మదే !
రాచకన్నె మాళవిక పదాహతి
పూచె నహో - అశోక మదే !!

# కుసుమితాశోకము

విరహాశిశిర మరిగె హృదయ
తరుణాశోకములు పూయ
వనములను భువనమ్ములను
నవవసంతమాయె !
కల్పలతికయైనా వర పారిజాతమైనా
పెరటితరువె అమరయశో
మహితధీరలలితునకు
అగ్నిమిత్రు కూర్మి రాణి
యైనది మాళవిక !
అగ్నిమిత్రు నిట్టూర్పుల
అలరును వలపులిక ! !

# క లు వ వ ల పు

ఓ శశీ! ఓ శశీ!

కౌముదీ విలాసీ!

వలపే నా యాశయమ్ము
వలపే నా జీవితమ్ము
బ్రదుకులోని చీకు చింత
మరచిపోవ వచ్చినాను!!

జీవితంపు దేవళాన
దివ్యమంటపమ్మునందు
నీదు చరణతలము చెంత
అర్పింతును నా యెడంద!!

ఓ శశీ! ఓ శశీ!
కౌముదీ విలాసి!

## శశి పిలుపు

కలువా! ఓ కలువా!!
ఓ కలువా! సొగసులచెలువా!!
నీలి నింగిపైన తేలు చుక్కకన్నె వలెనె
నీలినీటి సరసిపైన తేలియాడినావా!! కలువా!!

తేరి పారచూచి నన్ను మిక్కిలి
ఏల కెంపు లొలికెదు నీ చెక్కిలి
కానుగదే ఓ చెలియా!
నేను నీకు పరదేశిని!! కలువా!!

మరులు జల్లు చిరునవ్వుల
తనియించితి వెన్నిసార్లొ?
నీలి నింగినెలత నొసట
కారాదు నా రేఖవోలె
నీలినీటి సరసిపైన తేలియాడినావా!!
ఓ కలువా! ఓ కలువా!!

# ఆనంద ప్రకృతి

ఆకు పచ్చని ఆకు ఆటలో
అల్ల నల్లన సాగు చల్లగాలికి తోగు
చేలవెన్నుల సన్నపాటలో
ఆనందమే చిందునే జీవితపు
టాశలే వెలుగొందునే!!
కలకలలాడే తరులతికలు వలపులు చిలికే
విరితోటలడోలికలో
జల జల జల జల మని ప్రవహించు సెలయేరులలో
తళ తళ లాడే సొగసుల మెరపులపాలకిలో
ఆనందమే చిందునే జీవితపు
టాశలే వెలుగొందునే!!
ఎడదలు పగిలించే ఎండలగాడ్పులలో
బ్రదుకుల కదిలించే వానలవరదలలో
దెస దెస ఇరుళౌ పెనుచాయల కారు మొగిలు!
ఉరుముల ఫెళఫెళలు! మెరపులు తళతళలు!
తరిగిన వెనుకను సన్నని వానలసోనలలో
ఆనందమే చిందునే జీవితపు
టాశలే వెలుగొందునే!!

# స్వేచ్ఛ

పాట తెలిసిన కోయిల లేమో
బయల స్వేచ్ఛగ యెగరగలిగింది!
పలుక నేర్చిన చిలుకమాత్రం
పంజరంలో యెరక లుడిగింది!

గుమ్మమున వ్రేలాడుచిలుకను
కొమ్మమీదీ కోయి లేమో
కమ్మగా వొకసారి పిలిచింది!
"అడవులంటా తోటలంటా
హాయి హాయిగ యెగిరిపోదా
మోయి నేస్తం రమ్ము ర" మ్మని
తీయగా వొకసారి పిలిచింది!

చిలుక నేస్తం సిగ్గుపడుతూ
యెరక కంటికి అడ్డుపెడుతూ
చిరుతగొంతుక తొణక నిచ్చింది!
'క్రొంజివుల్లా కొమ్మ దిగిరా
పంజరంలో పలుక నేరిచి
పళ్లు తింటూ కులుకుదా' మని
కళ్ల చూడకె కబురు చెప్పింది!

'ఇనుపయూచల యిరుకులోపల
యెరక చాపగ తావు లేదే
యెట్లు' లని అడిగింది కోకిలము!
'ఒంటికాలున కూరుచుండగ
మింటిలోపల వూచమే' దని
కంట తడి పెట్టింది కీరమ్ము!

'తోటభూముల హాయిగాలిపై
పాట లించుక పాడవోయీ'
అంది పాటలమేటి కోకిలము!
'సరస కూర్చో - నేర్పుతాలే
చదువు లయ్యల పలుకు లెన్నో'
అంది పలుకులకొలికి రాచిలుక!

'పాటలైనా పలుకులైనా
పరులదగ్గర నేర్చుటే' మని
హాయి నెరిగిన పికము పలికింది!
'పాట లేమిటి? తోట లేమిటి?
పాడు ఒట్టులు హాయిగా' నని
పంజరంలో శుకము పలికింది!
పాడుతూ పిక మెగిరిపోయింది!!

(రవీంద్రుని గీతి కనుసరణ)

# శరదభిసారిక

మధువని కానరావో సఖా ! నీకై
వెదకుచు వేసరిలితిన్ - సఖా - సఖా ! !
రానే లేదో ! ఎందో దాగితివో ! !
మధువని కానరావో !
నలుగడల చీకటాయె దారితోచదాయె
రానేరావో ! మధువని కానరావో !
నీవే పికమ్మై తరులలోన డాగి
కుహు కుహూ యని పిలుతువేమొ పిలుతువేమొ
కుహూ కుహూ యని పిలుతువో యీ వనాంతరమ
మరచితివో నీ చెలినే, తలపవేమొ బాసలనే !
మధువనిలో సుమడోలాకేళులలో
తనువుమరచు మోహనగానములోన
సురనదీజలములన్ సురుచిరమౌ ప్రణయనావ
సోలియాడరావో వేగమె వనతలికిరావో !

విరిసెనదే కలువచెలి, ప్రియుని కాంచినదో!
చంద్రికలై ఆశామాధురులే వెలింగె!
ప్రియతమమోహనమూర్తిని
కాంచగ నా మనమే చెలంగె!
ఎంతో వేసరితిన్ వనియంతయు నీకై వెదకితి
ఎందుంటివో!

ప్రేమజలధిలో నీదరావా!
మధువనకేళి తేల రావో!

# హృదయనావ

చిన్నదోయీ నా హృదయనావ!
సాగరరాజా మెల్లగపోవా!
చూడవోయి నావలోకి నీరుపోరాదోయి
సాగరరాజ మెల్లగ పోవా!!
గాలిరేగి వీచెను నాల్గువైపులా
రాత్రి అంధకారమాయెనే దారితోచదే
ధ్రువతార వెలుగులోన
నావ నడుపుము నీలోన!
సాగరరాజ మెల్లగపోవా!
చిన్నదోయీ నా హృదయనావ!!
తెరచాపా చుక్కాని ఇవి నావి కావుకాని
మనసులోన ఏదో తోచి పడవను వదిలాను!
సాగరరాజ మెల్లగపోవా!
చిన్నదోయీ నా హృదయనావ!!

(రవీంద్రుని గీతి కనుసరణ)

# గులాబి

సంజ నీరెండలోన
కెంజాయ చివురుశయ్య
అలవోక పవ్వళించె
అందాల చెలి గులాబి!!
పొంగారు వలపుబరువున
బంగారు రేకుకనుల
నిండారు తేనెచూపుల
నెలవంక విరిసె నోర!!
అలపానిలమ్ము వీచె
మన సెల్ల కలచివైచె!
మదిలోన నా గులాబి
వలచి మైమరువనీదె!!

# చిత్రార్జునులు

చిత్ర:—ఎవరో నీ వెవరో, నిను గని నా
భవమే మాన్యముగా!
ఓ అసామాన్యవీరా !
ఓ మహామాన్యధీరా !!

అర్జు:—విజయకాంక్షతో విశ్వము తిరిగే
వీరుడ—విజయుడ నో రమణీ !
నాగసతీ ! నీ నవ్యసురూపత
నయనయుగళిధన్యత నొందెనుగా !!

చిత్ర:—నా కనులయెదుట నిలిచిన కాంతిమయుడు
కౌంతేయుండేనా ? నిజముగ కౌంతేయుండేనా
నాకలల దేవళములోనే కొలిచిన కామదేవుడేనా!

అర్జు:—నాగసతీ ! అనురాగవతీ !
చిత్ర:—యోధపతీ ! విజయైకమతీ !!
ఇద్దరు:—యుగయుగమ్ములా తపములు నేడే
సఫలము లాయెనుగా ! !

(రవీంద్రుని గీతి కనుసరణ)

# పరిష్వంగము

హాయిగ పాడుదునా సఖి
హాయిగ పాడుదునా ! !
ఆకసమందున రాకాచంద్రుడు
నా కౌగిలిలో నీ సౌందర్యము
కాంచలేక నా మబ్బులలోపల
పొంచిచూచి సిగ్గున తలవంచగ ?
హాయిగ పాడుదునా !!
కరమున నొక మధుకలశము నిడికొని
ఉరమున నీ విటు లొరిగి యుండగా
తారాపథమును చేరగ గళమును
సారించుక తీయతీయ పాటలు
హాయిగ పాడుదునా !!

# నిదురపో

నిదురపో—హాయిగా నిదురపో!! నిదురపో!!

కనుమూసి హాయిగా నిదురపో!
నిదురలో కలలలోకమ్ములో తేలిపో!! నిదురపో!!

కలలలోకమ్ములో కనకపీఠమ్ముపై
వలపించు నీరాణి వదనచంద్రికలలో
పొంగేటి క్షీరసాగరములో!!
నిదురపో! నిదురపో! నిదురపో!! నిదురపో!!

తరగలై వరదలై ఆకసమ్మంటుతూ
పొంగేటి క్షీరసాగరములో
వలపించు నీరాణి వదనచంద్రికలవే
చూచుకో! చూచుకో! చూచుకో!
వలపించు నీరాణి వలచుకో!!
నిదురపో హాయిగా నిదురపో!! నిదురపో!!

# మెల్లమెల్లగ

మెల్లమెల్లగ మెల్లమెల్లగ !
ఉల్లమును కొల్లగొనిపోయే !! మెల్లమెల్లగ !!

దూరదూరము సాగిపోతూ
కరగు గీతిక చరణమో
గాలి అలలను తేలిపోయే
పూలమాలిక తావియో !! మెల్లమెల్లగ !!

ఇసుకతిన్నెలు దాటి దాటి
నీలితరగల నీటి అంచుల
గలగ లను మంజీరమో
అంచలమ్ముల నంటి జలజల
రాలు శీకరపూరమో !! మెల్లమెల్లగ !!

మెల్లమెల్లగ మెల్లమెల్లగ
ఉల్లమును కొల్లగొనిపోయే !! మెల్లమెల్లగ !!

# మధుర యామిని

మధురయామినీ మానసవీథిలో
నీరవలోకము నిదురకాంచె!!
దూరతీరాలను సాగరగానము
ఉచ్ఛ్వలస్వనుల మ్రోగి యాగె!!
జన్మజన్మల మధురాశయములు
శరదభ్రములై దెసలు ప్రాకె!!
చిరతరుణాశాజ్యోతి తారయై
చీకటి తెరలను చెదరగ తాకె!!
దూరదేవాలయమంగళగీతులు
భువనమోహనములై చెలరేగె!!
చపలచంచలసాగరగానము
సీమాంతరముల కరగసాగె!!
హృదయతంత్రుల ప్రణవమంత్రము
శాంతి శాంతి శాంతి యనుచు
అమరకాంతి కిరణజాలము
మహోదయమ్మని మారుమ్రోగె!!

(రవీంద్రుని గీతి కనుసరణ)

# చలికారు

చలికారు కౌగిలించె
కొండచిలువవోలె లోకము!
తొలికారు తలుపు చరచె
తెరచుకోదు కరవు వాకిలి!!
మనసందు మసలు పరువులు
వినువీథి నంటలేక
చిరుతగాలి నర్తనాల
జగతి శోభ నందలేక
తల వాలిచి యిల రాలెను
ముదురాకు లవెన్నో!!
నెరవిరు లాదవని తోటల
గళము విడిరాని పాటల
కరవాయె తరుణిమలు
అబ్బురమాయె మధురిమలు
ఇరులందె ఇనుపసంకెల
బరు వందె స్వతంత్రత!
పరమాణువు శకలమ్ముల
భయ మందె శాంతి, భద్రత!

# *హరిదాసికీర్తన

తన

అధరసీమపై అనిశమ్ము నర్తించే
మధురమురళి నే నైతినా!

తన

నీలతనువుపై తేలీయాడే
వనమాల యైనా ఐతినా!!
నే నేమి గా నైతి నా స్వామికి!!

సఖి

విరహిణి రాధనై వీధిని బడితిని
గోకుల మంతా హసియింప!
అదిగో కళంకిని మదనశరాహత
మాధవు ప్రేయసి రాధ అదే___

* వచ్చే నాలుగుపాటలూ గోరాశాస్త్రి విషవృక్షంనాటకంకోసం వ్రాసినవి.

నింద పా లయితి నందరిలోనను

మందిరమును విడలేను సఖి !

నిద్రాహారములు నిన్నటి మాటే
అలంకరణములు అవి యేలే ! !

నే నేమి గా నైతి నా స్వామికి ! !

## జూదరి వేదాంతం

వేరే జూద మెందుకూ?

వేరే పందె మెందుకూ?

ఈజీవితమున కదే అర్థం

వేరే వేరూ.........

ఒక్కసారి తెగించి

సాహసే ర్లక్ష్మీ యని

రంగమున కురికేవా,

గగనాంతరాళమున కెగసిపోయేవా,

ఖంగుమని మోత మోగేవా!

ఆ మరుక్షణ మందె

అథఃపాతాళానికే క్రుంగిపోయేవా!!

వేరే జూద మెందుకు?

ఒక పందెమునకు పాచికలు వేర్చిన

వేరొక పందెము పడునట్లే

ఒక్కదానికై నీవు పరుగులిడ
వేరొక్కటి నీకై వెంటాడగ
ఏ యొక్కరికైనా లభించేది
ఏమిటి పూర్ణానుస్వారమె !
వేరేజూడ మెందుకు ?
వేరే పండె మెందుకు ?

## జూదరి వేదాంతం

చూపు దూర మెందుకు ?
　　చూడు దగ్గరలోనే !
పందెం పారకపోతే
　　ఉందే కోటివేలురా ! !

కొండపల్లంలోన
ఎండ వెలుతుర్లోన
　　ఏదో మెరుస్తుందిరా
　　ఏదో పిలుస్తుందిరా
డాహాపడి నీ రసుకోని
మోహాపడి దారినిబడి
దగ్గర చేరంగానే
　　మాయమవుతుంది !
చూపుదూర మెందుకు ?
చూడు దగ్గరలోనే ! !

ఘూ రమైనా మస కైనా
హూ రమైనా అడు సైనా
దొరికిందే స్వర్గంరా
వలచిందే అప్సరరా
దూర మెందుకూ ?
చూడు దగ్గరలోనే !!

# కాలసర్పి

ఆడుదంటే
యేమనుకొంటివో !
చూడ, సుందరి రూపమునందు
ఆడు కాలసర్పము హృదయమందు!! ఆడుదంటే!!

దూరమందుండి చేయెత్తి
పిలిచేటి మోహనరూపం !
దగ్గరైతే అంటక తాకక
ఆడే శాపం ! !  ఆడుదంటే !!

కదిపి
కోపమ్ము నుంతైన రేపితే
పగబట్టి ఉరుకు !
తోక తొక్కడిన తాచై
నిదురింప దెర చచ్చువరకు ! !
ఆడుదంటే
యేమనుకొంటివో !

## *అనుభవభారము

ఎన్నో, ఎన్నొ, ఎన్నో ఫలాల్
ఎన్నో ఎన్నొ రుచి చూశాను ! ఎన్నో !
దానిమ్మ, ద్రాక్షలు, మామిళ్లు,
నారింజ, లరటులు చూశాను !
మేథస్సు మత్తెక్కించేవి ! ఎన్నో !
పారెయ్యి పళ్ళన్నింటినీ
కలిపెయ్యి పళ్లన్నింటినీ
కలిపెయ్యి ధూళితో లేదా
మొలిపించు కాటిలో !—
ఆకలికంటె మధురమ్మైన దేదీ ఫల మదేదీ!! ఎన్నో !

---

*వచ్చే నాలుగుపాటలూ 'బుచ్చిబాబు' 'ఉమర్ ఖైయాం' నాటిక కోసం వ్రాసినవి.

*           *           *

ఎన్నో ఫలాలు రుచిచూశాను
అన్నింట మధుర మేదో ఏదో !!
ఆకలి ఒకటే మధురఫలమ్ము
ఆకలి మించిన దేదీ ఏదీ !!
దానిమ్మలు ద్రాక్షలు, నారింజలు,
మామిళ్లూ, అరటులు చూశాను
ఇవి అన్నీ ఏటి ఫలాలో !
ఆకలి ఒకటే మధురఫలమ్ము
ఆకలి మించిన దేదీ ఏదీ?
ఎన్నో ఫలాలు రుచిచూశాను
అన్నింట మధుర మేదో ఏదో !

# ఖైయాము తత్వం

ఖైయాముతో కలిసి రావోయీ!
నీవు త్రాగిన మధువు నిజము కాదేని
నీవు నొక్కిన చెక్కిలే మిథ్యయేని
సృష్టి అంతా నిజమటోయీ!! ఖైయాముతో!!

నీ లోని యీ వెల్గు నిలిచి యున్నపుడే
నీ వాంఛితము లెల్ల నెరవేర్చుకోవోయి!
ఆ వెల్గు నీలోన ఆరి చనెనేని
ఏమున్నదోయి! నీవును శూన్యమోయీ!!
ఖైయాముతో!!

# హేమంతగానము

మట్టిబొమ్మలను వలచానే!—అవి
ఎట్టి ద్రోహమును చేశాయో !!
పరితాపపు మధువుతోడ
పరిపూతమ్మాత్మ నేడు !
లేదు నేడు నాకు వాంఛితమ్ము లేనే లేదు !
నేను ప్రకృతిలోన లీనమౌదు లీనమౌదు !!
ఎండిపోయినది యంబుధి !
ఎర్రపడిన దాకాశము !
అంధకారరాత్రినుండి
అనంతకాంతిలో కలియ
విమోచన మ్మయిన యాత్ర
విశ్వమ్మే నిండి వెలుగు !
లేదు నేడు నాకు వాంఛితమ్ము లేనే లేదు !
నేను ప్రకృతిలోన లీనమౌదు లీనమౌదు! !

# ఉమర్ ఖైయాం

సాకీ రావె సాకీ!

ఏదీ మధువు కలశము నింపు!! సాకీ!!

చలికారు చింతావసనము

తొలికారు మంటల విసరుము!

రెక్కల నార్చు కాలవిహంగ

మొక్కింత దూరమె పోవలె!!

సాకీ రావె సాకీ!

కలుగని రేపు గూరిచి అసలు

కలవర మేల సాకీ

గడచిన నిన్న గూరిచి అసలు

తలపగ నేల సాకీ!!

నేడే మనకు

మధువును గ్రోల - నేడే సాకి నేడే!!

సాకీ రావె సాకీ!

ఒంటెలపైని పాంథుల గుంపు
ఊగుచు సాగు శూన్యములోకి!
ఒక్కటివెన్క నొక్కటి కాగ
చుక్కలు నేగు శూన్యములోకి!
చక్కని నీదు పెదవులు కలిపి
చల్లగ నన్ను చేరుము సాకి!!
సాకీ రావె సాకీ!
ఏదీ మధువు కలశము నింపు!
సాకీ రావె సాకీ!!

# *కలలబేహారిపాటలు

౧ కలలూ బాబూ కలలూ!!

ఎవరైనా ఎవరైనాగానీ
కొనరండీ మహామంచికలలూ!!  కలలూ!!

ప్రేమ గనని విరాగుల్లారా!
శ్రీలు పొందని జోగుల్లారా!
అంద మెరుగని అభాగ్యులారా!
కుట్రమనసుల కుత్సితులారా!!  కలలూ!!

ఉన్నతపథాల ప్రేమమాధురుల
చిన్నిపూవులో చేర్చిన అందం,
పున్నమజాబిలి వెన్నెల వెలుగే
చిన్నికెరటమున చిందే అందం,
ఒక్క కేశమున విశ్వమ్మంతయు
తొక్కి యుంచు నవయౌవనపందం,

* 'బుచ్చిబాబు' నాటికకోసం వ్రాసినవి.

అన్ని అందముల అరచేతుల్లో
స్వర్గముచేసే తియ్యని కలలూ!! కలలూ!!

వ్యక్తులపై అధికారము నిచ్చే
శక్తి కలలు కావాలా?
విరక్తివల్ల కర్మసన్యాసమూ
ముక్తికలలు కావాలా?
పిల్లా, మేకా, కొంపా, గోడూ,
భూమీ, పుట్రా, నగలూ, నట్రా
అన్నీ యిచ్చే యెన్నో కలలూ!!
కలలూ బాబూ కలలూ!! కలలూ!!

౨ కలలు కొంటారా! బాబూ
కలలు కొంటారా!!
బ్రతుకే కలయై కలయె నిజమౌ
కలలు కొంటారా!!
పాడులోకపు బరువు సంకెల
పారవేయ ర దేమి పాపము!!
కలలు కొంటారా!!
అంధులా బాబూ అ దేమో
ఆవరించిన వెలుగె కానరు!!

కలలు కొంటారా !!

కీర్తికాంతకు ఆశపడుదురో

ముక్తికాంతకు మోహపడుదురో !!

అమరులై జగమెల్ల యుగయుగ

మవతరించే కలలు కనరో !

కలలు కొంటారా ! బాబూ

కలలు కొంటారా !!

# మ ధు మా య

మ్రోయవే మృదు మురళీ ! హృదయములో మధుమాయా!!
అంతరాళమునకు సాగి అలసగతిని మ్రోగి మ్రోగి
అవశ మౌాచు రాలిపడెను ఆశాతంత్రు లవనిపైన !!
కదలికేని లేనిజగము నిదురలోనొ నీరవతనొ
కారుచీకటులకౌగిలి కన్నుమూసి సురిగిపోయె !!
మరల మరల పిలుచునవే ! తరళమధురగీతు లేవో !
రాలిన ఆశాతంత్రులు తూలి కలసి మ్రోయగోరు !!
మ్రోయవె మధుమురళీ !
హృదయములో మధుమాయా !
నీరవరాగజలధిలో
నిబిడనిరాశావధిలో
తేలి తేలి ఉదయించు వెలుంగుల
తీయని యాశల రొదలో !
మ్రోయవె మధుమురళీ !
హృదయములో మధుమాయా !

## మంచు తెరల ఆశలు!

నును మంచు సోనలో—తళ్కు మను
తొలుసంజ మెరపులో
పలపించు భావాల అలలలో కలలలో
నీ రూపె తోచునోయి—నా ఆశ
నీ వైపె సాగునోయి!!

సెలయేటి పరువులో—మెరిసేటి
నీరెండ తళుకులో
ప్రణయమే విరహాంపు టనలమై ప్రళయమై
నీ వలపె తోచునోయి—నా ఆశ
నీ వైపె సాగునోయి!!

విరితోట మలుపులో కురిసేటి
పరిమళపు బరువులో
తలపు దొంతరలలో చెలగేటి స్మృతులలో
నీ హాయలె తోచునోయి—నా ఆశ
నీ వైపె సాగునోయి!

# లోకాలోకం

ఏ లోకానికి ఆలోకం ?
ఈ లోకానికి ఈ లోకం
ఆ లోకానికి ఆ లోకం
ఈ లోకానికి ఆ లోకం
ఆ లోకానికి ఈ లోకం
ఆలోతాని కాకేలోకం !
ఈ లోకానికి ఆ లోకపు
ఆలోకం తుది పెను శోకం !
ఈ లోకంలో ఆ లోకం
వీలైతేనే ఈ లోకం
లో ఆలోకం ఒకనాకం !
సుఖానందలోకాలోకం !
ఏ లోకానికి ఆ లోకం !
ఆ లోకానికి ఆలోకం
ఈ లోకానికి కాకుంటే

అది యేమో ఒక మాలోకం !
మా లోకానికి మీ లోకం
మీ లోకానికి మా లోకం
ఒక ఆలోకపువయితేనే
ఆ లోకంలో మీకూ మా
కూ ఒకే ఒక్క ఆలోకం !
సుఖానందలోకాలోకం !!

## జన్మభూమి

మేలుకొనవా మాదు జన్మభూమీ!
మేలుకొనవా మాదు ఆంధ్రభూమి!
నిద్రా జడత విడవా
దారిద్ర్యతమస్సు లడగెలే!
ఆర్ద్ర మనస్వినీ! ఆనం
దారుణ భవోదయాన! మేలుకొనవా!
సశ్యామల సుశ్యామల
స్వర్ణపతాకాంచలాలు
తిరుమలేంద్ర కీలసింహా
గిరిమారుతములను తేల! మేలుకొనవా!

గౌతమీ కృష్ణా పంపా
ఘనతరంగగానములో
కలవిహంగ వైతాళిక
గళశంఖారవము వినవా! మేలుకొనవా!

చైత్ర కిసాలయతోరణ
కోమలలసనములో
యాత్రలు ముగిసిన యోధుల
విజయ విహాసనములో
ఆశల వెలుగులలో
నిరాశల పరుగులలో
మేలుకొనవా మాదు జన్మభూమీ !
మేలుకొనవా మాదు ఆంధ్రభూమి ! !

# నవోదయాశ

నవోదయ మెపుడో! దేవా,
శుభోదయ మెపుడో !!
దవానలకీలలై, ద్వేషము రోషము భువి నిండెగా !!
నవోదయ మెపుడో !!

నీతిహీన సంగరాల నంధకార మాయెనే,
స్వాతంత్ర్యభాను డే విహాయసాన దాగెనో !!
నవోదయ మెపుడో !!

క్రూర మారణాయుధాల ఘోరభయద నర్తన !
ఉదారజీవితాశయాల స్వేచ్ఛావికర్తన !!
నవోదయ మెపుడో !

ఆరాటమ్మే ప్రాణధనమ్ముల
కరచేతులలో ననుక్షణమ్ము
తీరని పర్యవసానపు పోరాటమ్మూ
సదసత్తుల కనిశమ్ము !! నవోదయ మెపుడో !!

ఆశోద్ధతులై జగముల హత మొనరించే అసురుల
ఉసురుల గొనవో
తరుగని నీ దయ అమృతలహరులై
ఝరులై కురియగ మే మరయుదుమో!!
నవోదయ మెపుడో!!

# శాంతి శోధ

నడవనిచోటెల్ల నడుస్తూ........
మడిచిన వ్రేలినే మడుస్తూ........
వడి దిరిగే విశ్వంలో......
సుడి దిరిగే విశ్వంలో!!......
కడలేని పయనాలలో
కడిచాయి యుగాలెన్నో
తడబడే చరణాలతో
కడలనే నయనాలతో
ముడివడిన చిరుపాటతో
ముడిలేని యెదమూటతో
తడివడిన కనులసోదతో
తడిలేని పెదవిరోదతో
కడిచాయి యుగాలెన్నో
కడలేని పయనాలలో!!

# అన్వేషణ

దారిచూపువాడె లేక తరలిపోవాలి
కొండదారులందు వొంటరిగా తడుముకోవాలి
అడవులందు కుంజకుంజ మరసి చూడాలి ||దారి||

చిన్నిచిన్ని గుహాలు చూసి లోయలు చూసి
కొండలసెలయేటినీట కళ్లు తుడుచుకోవాలి ||దారి||

విజనసరోవర సువర్ణసోపానములఁ
కదలియాడు పైడిహంస బారులలోన
హాయిగ మలయానిలాన నూయల లూగే
కొమ్మకొమ్మ కోకిలమ్మ గూడులలోన
మరపురాని తీయబాధ అరసికోవాలి !
అడవులందు కుంజకుంజ మరసి చూడాలి... ||దారి||

ఆకసమ్ము క్రింద నిలిచి ఏకాకిగ నొక్కసారి
అంతరాంతరముల గాథ లాలకించినాను
పలుకు లెవో నోటినుండి వెలువడినవిగానీ

గగనగర్భమందు కలిసి కరిగిపోయినాయి
తెల్లపోయి ఏకాకిగ తేలిపోయినాను
బ్రతుకంతా కొండలలో పడి తిరగాలి!
అడవులలో కుంజకుంజ మరసికోవాలి!
దారి కానరాని చోట తడుముకోవాలి!
అంతరనేత్రాంచలాల అద్దుకోవాలి!

(రవీంద్రుని గీతి కళసరణి)

# ఊరడింపు

ఊరడిలవె ఓ నళినీ! రాణీ!! ఊరడిలవె!!

వెలుగు చీకటులు, పవలును రేయీ
విశ్వరంగమున వేడుక తెరలే!! ఊరడిలవె!!

వాడుకయౌ తీయని కలవరమున
నేడు రేపు తిరిగి తిరిగి కలుగునె!! ఊరడిలవె!!

రాతిరి లేకయె కలుగునా వేకువ
వేకువనే నీ కల సఫలమ్మౌ! ఊరడిలవె!!

# దిగుదిగు

దిగు దిగు నాగా!

దిగరా నాగా!! దిగు!!

దిగు దిగు దిగరా నాగా

దిగరా నాగా దిగరా నాగా!! దిగు!!

తెల్లనీ శివునీ మెడలో

నల్లనీ కాలనాగూ

నీవెగా ఓ నాగా, నీవెగా ఓ నాగా!! దిగు!!

నల్లనీ విష్ణువుకూ

తెల్లనీ శేషపాన్పూ

నీవెగా ఓ నాగా, నీవెగా ఓ నాగా!! దిగు!!

వేయిపడగాల నెత్తీ

మోయుదువు భూదేవినీ

మనుషులా ఉసురులంటే మనునేమో నీకు నాగా!!

దిగు దిగు నాగా !

దిగరా నాగా !

ఓ నాగా దిగరా ! నా తండ్రీ దిగరా !

నీ కోరా విషమూ లాగికోరా నాగా !

ఓ నాగా దిగరా ! నా తండ్రీ దిగరా ! !

# హింసాయే ఉన్మత్త పృథివీ

ధరాతలము హింసోన్మత్తము
ద్వంద్వభావసమరోద్రిక్తము
లోభ జటిలబంధము లడచ
ఘోరకుటిల పంథల నడుచు !
నూతనావతారము నెత్తి
కాతరులగు సకలప్రాణులకు
అభయ మిమ్మహో మహాప్రాణ !
ఆలకింపని మమృతవాణి
విరియనిమ్ము ప్రేమకమలము
చిరమధునిష్యంద మమలము !

ఓయి శాంత ! ఓయి ముక్త !
ఓహో అనంతపుణ్య !

---

రవీంద్రుని వంగగీతమునకు అనువాదము. ఢిల్లీఅల్లరులలో భంగీపేటలో మహాత్ముని ప్రార్థనలలో దీని వంగమాతృక ఆయనకు సభాసదులకు మనశ్శాంతి నిచ్చేది.

కరుణాఘన! కావింపు ధరా
తలి కళంకశూన్య!
రమ్ము! దానవీరా! రమ్ము!
ఇమ్ము! త్యాగకఠోరదీక్ష!
మహాభిక్షు! కైకొమ్మిదె మా
అహంకారభిక్ష!
దేశదేశముల శోకమ్మును
మోహమ్మును రూపుమాపవో!
ఉజ్వలముగ జ్ఞానసూర్యుడై
ఉదయసమారోహము సేయ
సకలభువన ప్రాణవృష్టియౌ
అంధజగతి కమరదృష్టియౌ
ఓయి శాంత! ఓయిముక్త!
ఓహో! అనంతపుణ్య!
కరుణాఘన! కావింపు ధరా
తలి కళంకశూన్య!

స్వార్థపిశాచచ్ఛన్నము లగుచు
అపరితృప్తి ఖిన్నము లగుచు
నిఖిలహృదులు ఆక్రందించె
దేశదేశముల రక్తకలుష
గ్లాని తిలకరూపము తాల్చె !

నీ దక్షిణహస్తము చాచి !
విననీ ! నీ మంగళశంఖము !
విననీ ! నీ శుభసంగీతము !
నీ సుందరచ్ఛందము !
ఓయి శాంత ! ఓయి ముక్త !
ఓహో ! అనంతపుణ్య !
కరుణాఘన ! దీవించు ధరా
తలి కళంకశూన్య !

# అమరగాయకుడు

వృథావ్యథితచరితోద్గాతా !
సుధామధురగీతోద్గాతా !
యుగయుగాలు జీవితపథాన
దగాపడిన జీవుల హృదార్తి
ద్రవమై నీనీగళమున స్రవించు !
హృదయమ్మే నీకు గళమ్మా?
వ్యసనమ్మే నీకు వరమ్మా?
చేతలలో తలపోతలలో
కైతలలో కనుమూతలలో
ఆశలలో ఉడురాశులలో
జోతులకై మొగురుతు పోతా !
ముంగిటి తలుపే వంగిన దయి
మొగురకయే తలపై తగులు!
దిగుచుండగ జోతులు రగులు !
మిగిలేదే యెడదకు దిగులు !
వగపుజీవికల పెనునొగులు !

"పొగిలి లోలో కుములు గాయమె
రగిలిమండెను నీ హృదయము !
ఎగయు నీ యింటిదీపము కొసలె
బుగులుకొని తగులవడె గృహాము ! !"

# స్మృతిసీమల్లో సైగల్

గేయకారు లేవ రైతేనేం
భావాలకు నీ హృది నెలవై
నీ తియ్యని కంఠ నాళమున
నిస్తుల మధువులుగా రాలాయ్!

రజకినీ ప్రియుడవై పరచి
ఘాతుకలోకము నేమరచి
మధురగీతమాలికతో నవ
ప్రణయసౌధమును నిలిపావు!

"ప్రేయసి వస్తే శ్రావణము
ప్రేయసి లేందే ఏ ఋతువూ
భాసించ" దనుచు పాడేవు!
యువకులకూ విద్యార్థులకూ
ప్రేమికులకు అది వొక వేదం!

"గడచిన దినాలు సుఖదాలై
కలలో తియ్యదనా లవుగా!

దుఃఖంలో ప్రకృతదినాలు
ఒక్కింతయినా గడవవుగా !''
అని ఆలాపిస్తూ నవ్వేవ్,
అది నవ్వో లోకపు కఠినహృ
దయాని కొక సమ్మెటవుహో !

ప్రేమికు మార్గ మ్మీజగతిని
కంటకమయ మన్నావు !
ప్రేమకుఫలిత మ్మీజగతిని
దుఃఖమ్మే అని తేల్చావు !

నీ శక్తిని వినియోగించి
నీ ప్రయత్నమును కావిస్తే,
కలిగే సత్ఫలితా లన్నీ
కావిలించుకుంటై నిన్నని
ధరిత్రిమాతను సేవిస్తూ
పవిత్రముగ చాటించేవు

''చేతో నను రమ్మని పిలిచి
కాల దన్ని పొమ్మంటుందా !
చిన్నతనం అయితే మాత్రం
హృదయం లేదా అమ్మాయికి ?

అని వాపోతూ నువ్వు దగ్గిన
ఆ దగ్గున ఖంగు ఖంగు మని
మారుమ్రోగుతై లోకంలో
మోసపోవు ప్రేమికహృదయాల్!"

వీథిగాయకుడవై నువ్వు
చేతులార పైకితెచ్చిన
ప్రియురాలే నిన్ను కాదని
లోకపుషోకుల పాలైతే
నీదుహృదయవల్లకి విరిగి
రోదింపగ కొండలె కరిగాయ్!

నీ నేర్పినపాటే గొప్పగ
తాను పాడగా సభలోన
తనని మెచ్చువారే అంతా,
నిను చూచేవారే లేరు!
ఏమిటి ఈ అన్యాయమ్మని
ఎలుగెత్తి విలాపించేవు!
సులువుగ బ్రతుకున దగాపడే
కవిహృదయాలను కలిచేవు!

ఆరిపోని దీపపు వెలుగున
కొనవూపిరి నీ పాట వినే
కోరికతో వేచిన ప్రేయసి
దేవలోకసీమల నా మేను
రాకుమార్తె చేసినపాట !
గుండెబరువు తీర్చినపాట !
లోకములో ప్రణయజీవులకు
'మరపురాని తీయనిబాధ !'

'దివ్వె జ్వలించా' లని పాడావ్ !
నువ్వే ఆరనిదివ్వె వయావ్ !
నీ పాటలు మాస్మృతిసీమల
తరిమి తరిమి వలపించే నం
దనవన చందనపవనాలు !
తలపు దొంతరల మెదిలే క
మ్మని కర్పూరపుధూపాలు !

# భగ్నప్రతిమ

ఎచట ఎచట శిలకు ముక్తి ?

ఎచట మనుజ హృదికి ముక్తి ?

కళలలోనె కళలలోనె కలదు కలదు శిలకు ముక్తి !

కలలలోనె కలలలోనె మనుజహృదికి కలదు ముక్తి !!

ఎచట ఎచట ?

కడలి అలల బానిసగా గడపి ఓర్మి నేర్చిన శిల

అగ్నిపర్వతంపుగర్భమందు క్రాగి వేగిన శిల

నరుల గగనసౌధముల పునాదిరాయిగా నగు శిల

కెచట ఎచట ?

తరతరాల ఎండ వాన తాకిడుల కృశించిన శిల

యుగయుగాల మనుజపాదయుగళి మోసి అలసిన శిల

కెచట ఎచట ?

---

'బుచ్చిబాబు' నాటికకోసం వ్రాసినది.

కలలో ప్రణయమధురిమల చవిరాయే మనుజహృది ముక్తి!
శిల్పిచేతి ఉలి నర్తనముల విలయము శిలకు ముక్తి!
విరిగిన శకలాల దివ్యవిగ్రహ మా టదియె ముక్తి!

ఎచట ఎచట శిలకు ముక్తి?
ఎచట మనుజ హృదికి ముక్తి?

# యశోధర వ్యాకులత

ఉషస్సుల శాక్యపురీవనముల
వికసింప మానె తామర లేలో ?
తమస్సు లలమి విన్నవోయె వెన్నెల
రేలను రాచనగర దేలో ?

యశోధరరూపలత
వసివాడెను వ్యాకులత !
నటించు విరాగతలో
మరపించు విషాదతయే ! !

అశేషజీవతతి యార్తి బాపగా
నరిగిన విభు డిక రాడో !

ఆర్తివిముక్తాశేషజీవనుతిలో
తనకును సుఖ మీడో !
యశోధరరూపలత
వసివాడెను వ్యాకులత ! !

# పురప్రవేశము

నేడే వచ్చునటమ్మ—నేడేనటమ్మ!
నిర్మలప్రేమతో నిఖిలమ్ము పాలించు
రారాజసుతుడు—శ్రీతథాగతుడు!!

శృంగాటకాల చివురుల తోరణాల
స్వాగత మ్మిచ్చేటి పారిజాతాల
మధురమా భగవానుమందహాసాలు!!
నేడె వచ్చునటమ్మ నేడేనటమ్మ!!

అడుగడుగు వందారుకోటిశీర్షాలు
అగరుధూపాల చందనసౌరభాల
అఖిలహృదయాల ఉచ్ఛలసాగరాలు!!

నేడె వచ్చునటమ్మ నేడేనటమ్మ!!

# మాంచాలా బాలచంద్రులు

౧. ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు !
ఇన్నాళ్లుగ తలవాకిలి యిల్లై తపియించుట
ఎన్నాళ్లకు ఎన్నాళ్లకు ఈప్సితము ఫలించుట
ఇన్నాళ్లకు నాస్వామిని కన్నారగ కాంచుట
సన్నజాజి విరిసరముల స్వాగత మర్పించుట !
హృదయేశ్వరు ప్రణయఖేలనాల తేల నిత్తునా
కదనమునకు పద మని పదనుకత్తి నందిత్తునా ?
పలనాటికి కాపునేయ వలపు త్రుంపనేని
వెలయాలికి తులయని నిందలుపడు తలపైని
పతిదేవుని రణదీక్షామతి నొనరించెదనుగాక
క్షితిని వీరపత్ని నన్న నుతి వెలయించెదనుగాక
ఇన్నాళ్లకు నా స్వామిని కన్నారగ కాంచుట !
ఎన్నాళ్లకు ఎన్నాళ్లకు ఈప్సితము ఫలించుట !

౨. ఎదలో కదలు వ్యథ లేవో కథ లేవో ఇన్నాళ్లు !
ఎరిగింపనా ప్రాణేశా! ప్రాణేశా !

నీ భవ్యరూపమె తలచు
నా భర్మపాంచాలికలూ
నీ శ్రావ్యనామమె పిలుచు
నా శారి కాకీరములూ
నీ రాకకోసమె నిలుచు
ఆరామసుమవల్లికలు
నాయెదలో కదలు వ్యథలేవో కథ లేవో ఇన్నాళ్లు!
ఎరిగింపనా ప్రాణేశా! ప్రాణేశా!
కాల మ్మొక్కరికోసము అకటా
కాచి యుండునది కాదు
రాకరాక వచ్చిన నా విభుడవు
పోక తీరదాయె పాలికలనికి
క్షణక్షణ నిరీక్షణలో నే నిక
మనవలసినదేనా వేదనతో!

* * *

వాలు తాల్చి పోరు సల్ప నేగరే, లీల
వైరి వీరవరుల డీలు పరప నేరరే!!

---

ఈ రెండును 'గోపీచంద్' మాంచాలనాటికకోసం వ్రాసినవి.

# రు చీ దే వి

కృష్ణనృపతి యశోగాథ
రుచీదేవి ప్రణయగాథ
అమాయికాహృదయమునకు
విచిత్రపరిశోధ !

యాదవనాథునికే సరి కృష్ణరాయనృపకేసరి
వైదర్భిదేవి కెనయగును గజపతిరాజతనయ !

పితృపరాభవంపుబాధ
పతిప్రణయమధురగాథ
అమాయికాహృదయమునకు
విచిత్రపరిశోధ !

ప్రేమదూత శాంతిదూత ప్రియుకంఠరవమ్మో,
పితృపరాభవముచేసిన శత్రుకర్కశస్వరమో!
తన హృదిలో తీరెడుకోర్కెల ఆశలపరుగులు,
తన దేశములోన. అపజయపు నిరాశమూల్గులు !

పితృపరాభవంపు బాధ
పతి ప్రణయమధుర గాథ
అమాయికా హృదయమునకు
విచిత్రపరిశోధ !

తన హృదయేశ్వరుని చేరి తా నొకతె సుఖించుటో !
తనవారి పరాభవమ్మునకు ప్రతీకరించుటో !
కలల డోలికల నాథునికౌగిలిని సుఖించుటో !
కల్యాణగృహమ్ము రక్తకలుషిత మొనరించుటో !

పితృపరాభవంపు బాధ
పతి ప్రణయమధుర గాథ
అమాయికా హృదయమునకు
విచిత్రపరిశోధ !

# ధరిత్రీమాత

ఓర్మి తాల్ముల పైడినావు!
ఓ ధారుణీ! మాతృదేవి!

సంజె కెంజాయ పీవనలు,
క్రొంజివురుగుబురు జాలరులు,
తల్లి, నీ యడుగుదామరలు !

సడిలేని చదల పెన్నిరులు,
కడలేని ముదిమి నిద్దురలు,
తల్లి, నీదారి తెరతెరలు

ఓరితాల్ముల..................
కొన లెగసిపెనగుచీలికలు,
అనలమాలికలనాలుకలు,
అమ్మ, నీహృది వికావికలు !

శివునితలపై కొండచిలువ,
చలువసోనల తెల్లగలువ,
అమ్మ, నీపయి మంచువలువ !

ఓర్మి తాల్ముల..................

చెలగు మృదుమధురస్వరాలు,
పలుకు యువమత్తహృదయాలు,
జనని, నీదు మధూత్సవాలు !

చెడిన కోరికల పాపాలు,
విడిన గుండియల తాపాలు,
జనని, నీగర్భశోకాలు!

ఓర్మి తాల్ముల..................

ధనముగా తూగు ప్రణయమ్ము,
ఘనముగా మ్రోగు వినయమ్ము,
అమ్మ, నీమ్రోల ననయమ్ము !

మేడలే కూల్చు ద్వేషాలు,
వాడలే కాల్చు రోషాలు,
అమ్మ, నీ ప్రకృతిదోషాలు !

ఓర్మి తాల్ముల..................

ఎవకలచు వికలదృశ్యాలు,
మదిచెరచు వికృతలాస్యాలు,
అమ్మ, నీ విచలితాస్యాలు !

ఓర్మితాల్ములు...............
కొలలేని సౌందర్యపాత్ర,
తులలేని యానందమాత్ర,
జనని, నీ తుదిలేనియాత్ర !

ఓర్మితాల్ములపైడినావ !
ఓ ధారుణీ ! మాతృదేవి !

# రావమ్మా!

రావమ్మా మా తెనుగుతల్లీ! (అమ్మా తల్లి!)
అమ్మా, రావమ్మా! తల్లీ, రావమ్మా!
తరలిరావమ్మా మా తెనుగుతల్లీ!!

ఇరుగుపొరుగూవారి పొరపొచ్చెములు లేక
గతుకుబితుకూ లేని గౌరవపుదారిలో!! రావమ్మ!!

పచ్చపచ్చనిచేల పైటనీడల్లోన
పైడిరవ్వలు కురిసి భాగ్యాలతో మెరిసీ!! రావమ్మ!!

తుంగభద్రా పెన్నా, కృష్ణా గోదావరుల్
నీ తీరమై పొంగి నీ ప్రజల పాలింప!! రావమ్మ!!

తిరుమలేశునికొలువు, సింహాద్రిపతి చలువ
శ్రీశైలవిభుకరుణ, కనకమ్మ దయకలిగి!! రావమ్మ!!

# తృష్ణ

కొండవాలులో కొలనొక్కటి
తళతళ మురిపిస్తోంది!
ఎండ పడినప్పు డల్లా ధగధగ
ఎంతో మెరుస్తోంది!!

అడుగులు తడబడ ఎంతగ పరుగిడి
తరలిపోయినప్పటికీ,
కడుదూరమ్మున కదలదు మెదలదు
కాలి కంద దెన్నటికి!!

దూరము వదలక దారిని మ్రింగే
కొండచిలువ తళుకులో!
చంద్రుని మ్రింగి నెమరువేసుకొను
తమోగ్రహపు బెళుకులో!!

కడపల బారులుతీరిన వెలుగులు
కరిగి సురిగి పోతాయి!

కడల, పైని, లోన, కాఱుచీకటి
కురులు క్రమ్ముకుంటాయి !!
ఎందు కెందు కీ పరుగులు - అందగ
నలవికాని వెలుగులు !
ఎంత గడచినా ఏమి మిగులు, తుద
కంతు లేని దిగులు !!

## నా వి కా

ఏ తీరమని చేరెదో
నావికా
ఏ తీరుగా చేరెదో ?

తెరువైన నను లేదు
తెన్నైన గనరాదు
పాటిరేవును కాదు
నీటిజాడయు లేదు
ఏ తీరమని......!

చలనమైనను లేదు
శ్రాంతియైనను లేదు
దరిదాపు గనరాదు
దాటు నావయు లేదు !
ఏ తీరమని......!

తెలిచాప, చుక్కాని
తిప్పు మాలిమి గనవు !

మన్ను మిన్నును గాల
మానమేనియుఁ గనవు!
ఏ తీరమని.....!

అందమైనను లేదు
హాయియైనను లేదు
ఆత్మ దాహము తీరు
ననువు లేనే లేదు !
ఏ తీరమని.....!

ఎగయు భావాలతో
తెగని చింతనముతో
ఎగిరిపోకోయి నీ
ఇలువీడి యొంటటికో !
ఏ తీరమని చేరెదో
గానికా
ఏ తీరునా చేరెదో ?

# పోయిన స్వర్గము

పోయినది మన పుణ్యలోకము
పోయినది మన పూర్వనాకము !
హాయిభోగము లడగ మిగిలిన
దంతు దొరకని నరకజీవిక !

మునుల పలుకుల వెలుగు లడగెను !
కనుపొడుచు చీకటు లలముకొనె !
మన పురాతనవీరు లేరోయ్ !
మనదు నాకోద్ధారు లేరోయ్ !

తొలుత శాస్త్రము లెవరు చేసిరో !
తొలుత కావ్యము లెవరు పాడిరో !
తొలుత నాగరకు లెవ రోహో !
ఏడు దీవులు కలయ నేలుచు

నినుడు దిరిగే విశ్వమంతయు
సొరగము లూర్ధ్వలోకమ్ములు
చక్క బెట్టిన సార్వభౌములు

వారలేరీ? వారలేరీ ?
వారిసంతతి వారికేవీ
వారి పూర్వుల జ్ఞానసంపద
వారి పితరుల శక్తిసంపద ?
మాయకలి వచ్చిపడె నెన్నడో
మనము శక్తివిహీను లైతిమి !
కులము లెన్నియొ కుదురుకొన్నవి !
కొలది గొప్పలు నెలవుగొన్నవి !
కత్తు లన్నియు నొరలపై బడె
కత్తులను దాకినవి యొరలును
రెంటి యైక్యమ్మందె యారెం
డింటి సౌఖ్య మ్మింట తెలియరు !
కలిమి నిచ్చె పసిడిపంటలు
తెలికడుపులను నింపబోవగ
బలిమి గాల్చె కడుపుమంటలు
ప్రభుని కలిమికె యొసరు పెట్టవొ ?
రత్నగర్భని పేరు గాంచియు
రాణివాసపు బ్రతుకు బ్రతికిన
అమ్మ యిప్పుడు కాలవశమున
అమ్ము డాయెను పరులపంచను !

వేయలే, దే సవతితో — ఏ
మాయపందెము నెప్పుడైనను
చాయలగు పరులకడ నమ్మకు
తప్పలేదోయ్ మాయదాస్యము !
వైనతేయుల బలము గూరిచి
శ్వేతవాహను జావనోరిచి
స్వేచ్ఛయను నమృతమ్ము కొనితే
సిద్ధమగు నవసరము కల్గెను !
అమ్మ బానిసతనము బాపగ
ననువు వేరే దొరకదండోయ్ !
కోలుపోయిన నాకమునుదో
కొనఁగవలయును గపలి రండోయ్!

(19 8 లో వ్రాసినది.)

# రిక్కపాటు

విస్తృతాకాశ గభీరతనుండి
వినీలసాగర గర్భములోనికి
తారక యొక్కటి రాలినది;
బారులుగా జను తోడితారకలు
ఘోరమయిన నిశ్వాసము లెన్నో
హృదయము లద్రువగ విడిచినవి;
రిక్కల పొదిలో కాంతిపుంజము
అగాధభూమిని నిద్రించుటకై
ఇప్పు డిప్పుడే క్షణమాత్రంలో
పోయినది;

తారక లన్నియు తాముమాఅయి
తలపుల కోసిన విపులదుఃఖమున
అయ్యయ్యో! అని దీనదీనముగ
ఆర్చినవి!

పడుచున్నది, పడుచున్నది, అదిగో పడుచున్నది!
వినీలవనమధ్యగాఢములోనికి,
దుష్కర నిశీథగర్భమున ఆ అనంతమగు నాకాశంలో!
ఎన్నడయిన నామృతనక్షత్ర మ్మిరవుకొనున నా హృద
[యముపైని
ప్రశాంతముగ
ఆ యనంతమగు నాకాశమున ఆ వినీలసాగరగర్భమున,
ఆ నిశీథమధ్యమున!!

# కలకోసం - కలకోసం

నేనే ఆశాలేశంకోసం కలకన్నానో ఇన్నాళ్లూ,
ఆది పట్టికలే ఇంతా చేసి !
ఆ కల కాస్తా కరిగిన వెంటనే
కళ్లు తెరిచి చూస్తాను గదా,
సుఖానికే మొఖం, వాచి, ఒడల్ సడలి
ముసలిన్నై కనిపిస్తాను !
ఒక కలకోసు విదంతా ఒక కలకోసం !
చెల్లో బారుమనే కెరటంలా
చెట్టున కట్టుంచానా తంబుర !
మోగదు - మూగది - ఒక సంచీలో
ముడిచి మూట కట్టుంచా నక్కడ,
అంతా కలకోసం ! అబ్బ
ఇదంతా ఒక కలకోసం !
కదలక పరుండు మెదలక పడుండు
పగలబోవు నా హృదయమోయ్ !
బతుకూ లోకం మారిపోయిన్నై,
నాకు నేనె మారా నిది అంతా
ఒక కలకోసం - అంతా ఒక కలకోసం.

# రతి విలాపం

హే ప్రాణపతీ సజీవివో ?
కనిపింపవె నీ రూపరేఖలే !
ప్రోవై యిల రాలి తూలు ఈశ్వర
కోపానల భస్మరాశిలో !!
రమణీయ శరీర, నీమనోహర
రూప మ్మిటు భస్మమై చనన్
కనుచుంటిని ప్రీలిపోదె నాయెద
కాంతల్ కఠినాత్మలో యనన్ !!
కమలమ్మును నీతు వోరసి పారెడు
కల్లోలినివోలె నొంటినై
త్వదధీన ననున్ త్యజించితే
క్షణమందే గతసౌహృదుండవై

(కాళిదాసు ననుసరించి వ్రాసినది)

# చెలిమికతలు

మరపు తెరల చెలిమికతలు
తిరిగి పాడకోయి వెతలు !
తనువు తనువు మెలసిపోయి
ఉనికి బరువే మరచిపోయి
మనికి వలపు లోలుకు కతలు !
తిరిగి పాడకోయి వెతలు !
హృదయవిదారక శరాలు !
మా ప్రేమ కివే వరాలు !
మధురస్మృతు లీ స్వరాలు
విధుర వ్యథ లింక చాలు !
మరపు తెరల చెలిమికతలు
తిరిగి పాడకోయి వెతలు !

(అనార్కలీనాటికలో సలీము విషాదగీతి)

# ఎవరో హో !

ఎవ రోహో ! ఎవ రోహో !
ఇపుడా నను పిలిచేరు ?
హృది లోలో కలిచేరు ?
పగిలిన హృది శకలాలో
ఎగసిన జ్వాలాకీలో
ఎవరో రగిలించేరు !
ఎవ రోహో ! ఎవ రోహో !
ఇపుడా నను పిలిచేరు ?
బ్రదుకే హాలాహలమై
బరువై కర వయ్యెనే !
ఎవరూ నను మననీరో ?
విసమైనా తిననీరో ?
ఎవ రోహో ! ఎవ రోహో !
ఇపుడా నను పిలిచేరు ?

---

ఈ వచ్చే 9 పాటలు దేవదాస్ నాటికకోసం వ్రాసినవి.

జానపదం:

సేతులార వొాదులుకున్నావా,
నా యెట్టిబావా,

సిన్నిగుండెలు సెదిరిపున్నావా !
సేతులోని సిన్నిపిల్ల సెన్నుమీారిన వన్నెలపిల్ల
సేతులార వొాదులుకున్నావా,
నా యెట్టిబావా,

సిన్నిగుండెలు సెవరకున్నావా !
నిన్నే కోరి వొాచ్చినపిల్ల కన్నెవలపు నీదో కాదో

కన్నుమూసీ యెరగ నన్నావా,
నా యెట్టిబావా,

మిన్నులె మీాదా వొారగకున్నావా ?

## నృత్యగీతి :

సఖీ! సఖీ! మధుపాత్ర
సత్వరముగ కొనితేవే!
మనసున వలచినప్రియు డేతెంచెనే
మన గృహమ్ము మధువన మూచు నించెనే!
మలయవాయువులు వీచె
కలగీతమ్ములు లేచె
రావో రావో సఖుడా!
మధువు గ్రోలగ రావో
మధుర మధురమౌ వెన్నెలలో
మల్లెపొదలలే వన్నెలలో
ప్రేమగీతముల డోలికలో
మధువు గ్రోలగరావే!!

# పదవోయి - పదవోయి

పదవోయి ప్రయాణికుడా !
తల క్రింది మూట చేనిడి వడి పరుగిడి!!
కంటకవనులతో కడు నిండెనోయి దారి
వలలో పడేవు వలపించు పువ్వుల కోరి !!
తల క్రిందిమూట చేనిడి వడి పరువిడి
పదవోయి!!
వలపు తగిలెనా వదలనే లేవు
హృదిలో రగిలే సొద నోర్వలేవు!!
తల క్రిందిమూట చేనిడి వడి పరువిడి
పదవోయి!!

# దప్పి

నీటితో ఆరేది కాదే యీ దప్పి
నీటితో ఆరేది కాదే!

నీ ప్రేమజలధిలో ఈదులాడినగాని
తేటనై నీ వలపు తేనెలానినగాని!!
కోరికే తీరనీ తీరకే పూరనీ
గుండె లతికే వలపె మండి దహియించనీ!!
వంతలో సుఖములో వదలనే నీ ప్రేమ
కాటిలో నా యొడలు కాలునాడేకాని!!

నీటితో ఆరేది కాదే యీ దప్పి
నీటితో ఆరేది కాదే!!

# మ రు ని ము స ము

మరునిముసము మనదో కాదో
మధు వానవో మధుపా మధుపా!
వడగాలిని వాడునో యేమో
జడివానను రాలునో యేమో
తొంగలి రెప్పల చెంగల్వపూవే
తొంగిచూచె నదిగో కన్నావో!
రేపని మాపని చూడకుమోయ్!
రెప్పపాటుమాత్రమె బ్రదుకోయ్!
మరునిముసమె మనదో కాదో
మధు వానవో మధుపా మధుపా!

# జీవితము

జీవితము దుఃఖపూరితము - నేడు !
కడచిన దినాలు సుఖపూరితాలు !
మధురస్వప్నమో మలయమారుతమో !!
దుఃఖపూరితము జీవితము నేడు ! !
నా యనువారే లేనిలోకమున
ఏ యాసయు హాసము లేదాయె
కంటకయుతమ్మె ప్రేమమార్గ మే
కల్లోలమ్మె ప్రళయ మ్మయ్యెడు
జీవితము దుఃఖపూరితము నేడు !!

# ఏల రాడు?

నీలమేఘశ్యాము డేల రాడాయె !
తేలిపోయే మేఘమాలికలు నవ్వితే
నీలయమునాహృదయ మేల దిగులొందునో !! నీల !!

తన వేణుగీతిలో ఏల యీ జీర !
అమృతహృదినే ఏప వంచించి రాక !! నీల !!

నాదు నెదలో భయములే దిశల ఇరులాయె
లోని ప్రణయము నింగిపైని శశి కాదాయె !! నీల !!

# చరమగీతి

మృత్యు వెల్గెత్తి నిను పిల్చుచుండంగ
ఆశతో దేనికై ఆరాటపడెదు ?
ప్రేమతో వెలుగొందు జాలిచూపొకటి,
పగిలిన హృదయమ్ముపై అశ్రు వొకటి !

# బృందగానము

శంకరపదసేవారతుడౌ చంద్రదాసుఁడు
మానసదేవిని దేవతగా మదిని తలపడు !
మంత్రతంత్ర మహిమాన్విత దేవత క్రోధితయాయె!
చంద్రదాసు జీవితము విపత్పూరిత మాయె !
చంద్రదాసు తనయు నిరాశాసాగరమున ఆశానౌక
సుందరసుమకోమల బేహుల విదియచంద్రరేఖ !

---

వచ్చే ఐదూ బేహులానాటికలోని పాటలు.

# యుగళగీతి

ఆతను: ఇటు తిరుగవో... చెలి పలుకవో
చిరునగవుతో నను దరియవో...
నీలినీలి మేలిముసుగు తొలగనీ తొలగనీ!
బాలచంద్రముఖకాంతి వెలుగనీ వెలుగనీ!

ఆమె: మోము కదిపి కనులారగ కనలే
నేస్మిమ్ముల అలముసె సిగ్గెలో!

ఆతను: సిగ్గుతెరలు చీలనీ వ్రాలనీ
చిర్నగవుల వెన్నెలలు తేలనీ!

ఆమె: మనమున తీయనితలపులు రేగునే
మనసుదీర పలుకుదమన పలుకేయాగు నదేలో!
యీసిగ్గేలో!

# కాలనాగినీ

రావే కాలనాగినీ, దిగిరావే నీలభోగినీ !
బుస్సూ బుస్సు బుస్సూ బుస్సు మనుచు
నభస్సూ నందుకోవే అందుకోవే !! రావే !!

రెండూనాలుకలు, చండానలశిఖలు
మండీపడగ, పడగచాచవె చూచవే- రావే...

# వియోగ గీతి

విననోచనా యిక నా సఖా
నీ యమృతవాణి !
కనుతెరచి కాంచలేవో సఖా
కళలేని అభాగిని నీ సఖిని !...వినవోచనా !
పలుకాడ నైతినే సిగ్గున నిను
తిలకింప నైతినే !

తొలికలయిక ముగిసెనో ఒక క్షణములో
కంకణ నూపురగానము నీవే !
కుంకుమశోభయు నీవే !
ప్రాను కూలకాలిన తీవనుగద
తునియలుగా ప్రీలదేల నాయెద !
వినవోచనా యిక నాసఖా
నీ యమృతవాణి !

# నృత్యగీతి

వినర్తింతునే! వినర్తింతునే
విలోకించునా!
మనోనాథు మంగళమూర్తి
విలోకించునా!
పునర్జీవనోల్లాసముతో!
విలోకించునా!
మనోహరముగ నర్తింప
కాంతునో కాంతుని!
వినర్తింతునే! వినర్తింతునే!
జన్మజన్మములు తానే
మన్మనోనాథుడానో!
శాశ్వతప్రణయడోల
జీవితమె మధురమౌనో!

# నిశ్చలప్రేమ

కఠినమోయీ కఠినమోయీ
కంటకోపేతము గదోయీ!
ప్రేమికుల మార్గ మీ యిలలోన!!
ప్రేమికుల సౌఖ్యాలు కలలోన!!
లోకంపు క్రౌర్యంపు మంటల
లో తపించి నశించు నేది? ... ఏది?
ప్రేమికుల దేహమ్ము మాత్రమ్మె!!
లోకంపు క్రౌర్యంపు మంటల
క్రాగి ఉన్నతి జెందు నేది? ... ఏది?
నిశ్చలప్రేమమ్మె - ప్రేమమ్మె!!

---

వచ్చే 19 గీతాలు 'సత్య' రచించిన లైలామజ్నూన్ నాటకంకోసం వ్రాసినవి.

# మహల్

మా మహల్ !

మా మనస్సులో మహల్ !

ప్రేమనిర్మితము విశాలమౌ మహల్ ! !

చిన్ననాడె మాదు చిట్టిచేతులు నిల్పిన మహల్ !

మా మధురాశయముల యుద్యానవనమ్మున లేచిన

మా మహల్ !

జన్మజన్మలకు మా సుస్నేహామే జ్యోతులై వెల్గు

మా మహల్ ! !

చంద్రవంక సౌందర్యము మబ్బుకన్నె మాధుర్యము

సంజవెల్గు సౌభాగ్యము సర్వకుసుమ సౌరభ్యము

కలిపి తొరిపి నిర్మించిన మా మహల్ ! !

మా మనస్సులో మహల్ !

ప్రేమనిర్మితము విశాలమౌ మహల్ ! !

## బిచ్చం

మంచుతెరలో కనుల
నించే గులాబివై
నీ గృహద్వారాన
నిలిచావు రాణీ!
నీ హస్త మిడు భిక్ష
స్వీకరిస్తున్నారు
ఎంద రెందరో నేడు
ఇంటి ముందర నేడు!
అందరూ వెళ్ళాక
ఆఖరున నే వాస్తె
నే నంచు తెలియకే
పూవు లిస్తావు!
ఈ పూలకోసమా
నా రాక రాణీ!

మేలిమును గింత తోల
గించి చూపిస్తావా
చంద్రుణ్ణి గేల్చేయు
చక్కనో నీ మోము !!
మంచు తెరలో కనుల
నించే గులాబివై !!

# ప్రేమతప్పా?

ప్రేమయే అపరాధమా ?
ప్రేమ లేకున్న లోకాన ఏ మున్నదో !!
అల్లదే మింటిపై సాగు బుల్బులు జంట
వాటి ప్రేమను కంటగించువా రెవరో?
ప్రేమయే అపరాధమా ?

ప్రేమ నాలో పెరిగి పెద్ద దౌతుంటేను
నేను భగవంతునికి చేరు వౌతుంటాను
ప్రేమయే అపరాధమా ?
ప్రేమ లేకున్న లోకాన ఏ మున్నదో !!

# లైలా వీడ్కోలు

అన్నీ మరవ వలెనా?
అన్నీ కల్లలేనా?
కలలేనా యికపైని?

నా సుఖమ్మె తన సుఖముగ
నా బాధయె తన బాధగ
ఒకరి నొకర మెంత వలచి
యెన్నినాళ్లు గడపినామొ  అన్నీ!!

తల్లి మరిచి, తండ్రి మరచి,
ఇల్లు, లోకమెల్ల మరచి
లేగులాబి కుటీరాల
లో గడపితి మెన్నినాళ్లు  అన్నీ!!

# లైలా వీడ్కోలు

సెల వింక సెల వింక సెలవ్రూ!!
ఓ సర స్త్రీరమ్ములార,
ఓ గులాబివ్రూ వ్రుటీరమ్ములారా,
సెల వింక సెల వింక సెలవ్రూ!!
గడె వియోగమె సైపలేడు
కడు బేలహృదయమ్మువాడు
వీడిపోవలె ప్రేమమయుని
ఓదార్పరమ్మ నా ప్రియుని!
ఖర్జూరపవనమ్ములారా,
ఓ గులాబీతావులారా,
సెల వింక సెల వింక సెలవ్రూ!!

# మజ్నూ విలాపము

గుడారమెత్తివేశారు
కడ కొంటరిగ మిగిలాను
ఎడారిలో నా బ్రదుకే యెడారి కాగ!
నా వలపుల రాకుమారి
తో కలయిక లింకపైని
కలలందేనా? ఆహా కలలందేనా?
చిన్ననాట పాఠశాల
చెట్లనడుమ ఆటలలో
నాటి యిన్నియేళ్లు పెంచి
నాము మాదు ప్రేమలతను,
పెరికివేయగలదా యీ యిసుకతుపాను
లోకపు యిసుకతుపాను!!

# బృందగీతం

పదిల మోహనా, పదిల మోహనా
హృదయమా, హృదయమా !!
దూరదేశములోని ప్రియతము
చేరబోయే హృదయమా
చెరనిడేవా రెవరు. ని న్నిక
స్వేచ్ఛ కలిగెను నీదు ప్రేమకు !!

సాగు మోహనా, సాగు మోహనా
సాగు మోహనా, ప్రణయహృదయమ !!
నిన్ను చేరగ నీదు ప్రియతము
డెన్ని కడగండ్లు పడుచుండునో
సాగు మోహనా ! సాగు మోహనా
సాగు మోహనా ! ప్రణయహృదయమ !!

# లైలావిశ్వరూపం

ఎందుచూచినగాని నీవు, లైలా
మృతిలేదు ప్రేమ కంటావు!!
వెండియిసుకలలోన తళుకులో నీవు,
పండబారిన సంజ పసిమిలో నీవు,
సన్ననౌ నెలవంక మిసిమిలో నీవు,
మంచులో కనువిచ్చు
మధురమధురమ్మైన
లేగులాబీపూవు నవ్వులో నీవు,

ఇంచు కించుకలుగా
హృదయమ్ము నలరించు
ఖర్జూరమారుతము నీవు, లైలా
ఎందుచూచినగాని, నీవు లైలా
మృతిలేదు ప్రేమ కంటావు!!

# తుది పాట

ఎవని కలియగోరుదువో
ఏడీ అత డేడీ, అత డేడీ !
ఎదుట ఉసురు లేని తనువు
ఎవరిది, తనదేనా తనదేనా!
నీ ప్రియునిదే, నీ ప్రియునిదే !

కఠినలోక మేలో మిమ్ము
కలియనీయనైనా లేదు !
బ్రదుకనీయనైనా లేదు ! !

ఈ లోకములో కలయిక లింక లేవు ఇది నిజమ్ము !
పై లోకములో నీకయి ప్రాణసఖుడు వేచియుండు !!.

# సతీపరాభవం

రుద్రదేవా! మేలుకోవా!
భద్రకాళి అపర్ణ భస్మమాయెను!
నిద్రయా అది తపోముద్రయా
లే! రుద్రదేవా! మేలుకోవా!

సర్వమంగళ నీదు సతి పరాభవ మెట్టు
లోర్తువో! ప్రమథాళి ఆర్తి నెటు తీర్తువో
హే రుద్రదేవా! మేలుకోవా!

ఘోరపాపతమస్సు హోరు మని నాట్యమ్ము
చేయు నీభువి చీమ చిటుకు మన్నటులేని
లేదా హే రుద్రదేవా! మేలుకోవా!

విప్పవా! నీ నొసటికన్ను!
కప్పదువుగాని కాలానలజ్వాలలో
కలుషపూరిత వసుంధరను!!
ఎత్తవా! నీ విలయపదము!

చిత్తుగా చిందుత్రొక్కుదుగాని ఈ యహం
కార మత్తనిరంకుశాశయుల దుర్జనుల!!
లేవా! హే రుద్రదేవా! మేలుకోవా!

# అన్నపూర్ణ!

అన్నపూర్ణా! విశాలాక్షి! దేవి!
కన్నతల్లి! అహో! రత్నగర్భ!!

ఆకలను కేక లాకసము తాకె!
చీకటులమూక నల్దెసలు ప్రాకె!
చేరదా! నీ శ్రవోయుగళిదాక!
పారదా! నీ కృపాకాంతిరేఖ!!

అన్నపూర్ణా! విశాలాక్షి! దేవి!
కన్నతల్లీ! అహో! రత్నగర్భ!!

చిచ్చు లనిశమ్ము పచ్చుమొగసాల!
ముచ్చుల వశమ్ము పైడిధనశాల!
వాకిట శిరాలు రాలు పాలికలని!
ఏ కెలన నీ కృపాపాంగకలన!!

అన్నపూర్ణా! విశాలాక్షి! దేవి!
కన్నతల్లీ! అహో! రత్నగర్భ!!

మూగకంఠాల పిలుపు విన్నావా!
సాగనికరాల సంజ్ఞ కన్నావా!
మరణమో జడతయో లేవలేము!
కరుణ హస్తానికై వేచినాము!!

అన్నపూర్ణా! విశాలాక్షి! దేవి!
కన్నతల్లి! అహా! రత్నగర్భా!!

# హింసామత్త

హింసామత్త పృథివీ!
ధ్వంసలీలాతాండవమున
తనివితీరుటే లేదో!!
సస్యశ్యామల మా మృదు
లాస్యము రుధిరమయమాయె!
సాంధ్య గగన మందవీచి
ఝంఝానిలభయదమాయె! హింసా ॥

భగ్నాశయవా! హృదిలో
అగ్నులేల? ఆర్తులేల?
కఠిన శిలలె ద్రవియింపగ
కలుగు కంపనమ్ము లేల! హింసా ॥

లేవు మధువనస్వనాలు!
ఘోరశతఘ్నీరవాలె!

క్రుంగుదువిట కూలుదువట
నింగి కెగసి రాలుదు వెట ! హింసా ॥

ఇంకనైన వెలువడవా భ
యంకరతమసాపథాలు
శాంతి కాంతు లొలయు నమల
సౌఖ్యవియత్తలి చేరవా !
హింసామత్తపృథివీ ! !

# ధర్మచక్రావేదన

ఆర్తయయ్యెనే - పవిత్ర
ధాత్రి భరత భూమి నేడు !
ఆప్త మిత్రు లొండొరులను
హత మొనర్చు కదనస్థలి
రక్తసిక్త మయ్యె నయ్యె
రత్నగర్భహృదయతలి !!

ఆర్త యయ్యెనే !!

కర్మభూమి నే డెవ్వరు
ధర్మచక్ర మేగింతురో
బుద్ధదేవు బోధామృత
మర్థ మెవరు తలపింతురో ! !

ఆర్త యయ్యెనే ! !

ఆ యజాతశత్రు తపన
ఆ యశోకు దయాపరత

ఆ కనిష్కు ధర్మపరత
అవని నెవరు మరపింతురో !!

ఆర్త యయ్యె నే! !

స్వార్థపరులు కుటిలమతులు
స్పర్థాన్వితు లజ్ఞానులు
శిష్టహాని సేయగా, అ
రిష్టముల కాటకాల ! !

ఆర్త యయ్యె నే ! !

హతభాగినియై, అనాథ
యై, అరణ్యసీమయందు
పతిని గలియ గోరి పేర్చు
సతి చితాగ్నికీలలందు !!

ఆర్త యయ్యె నే ! !

తండ్రిని చెరసాలనుంచి
తాను గద్దె యెక్కె నొకడు
తనకు సుతుడు జన్మింపగ
తనగుండెలె ఝల్లు మనియె ! !

ఆర్త యయ్యె నే ! !

పేరజాత శత్రుండే
పోరు సల్పె బ్రతుక దెల్ల
కర్మపక్వ మై బుద్ధుని
ధర్మమె శర ణన్నదాక!!  ఆర్త యయ్యెనే!!

యుద్ధానలకీలలలో
క్రుద్ధకాలసర్పవిష
జ్వాలలలో క్షతనారీ
బాలవృద్ధరోదసలో !!
ఆర్త యయ్యెనే!!

## రాజ్యశ్రీ శోకగీతి

జ్వాలాకీలలలో రాలి, కాలి కాలి, ధూళి తూలి
చాలింతును నా జీవిత మిక !
ఈ చితాగ్నియే శరణ్య మిక !!
గాలిలోని పిచికగూడువోలె రాలె నా పెన్నిధి,
ఏలా బ్రతుకుదునో యింక యెవరికోరకు? నా కెవ రిక !!
నా సర్వస్వమ్ము నాశన మ్మాయె నయో అదేలో !
వాసంత విలాస మేసి వ్యర్థజీవినో నా కిక !!
ఏ వధూవరుల నెడబాపిన పాపినో గతజన్మను ?
ఈ విధిని దురంతచింత జీవిత మెటు గడపుదు నిక ?
జ్వాలాకీలలో రాలి, కాలి కాలి, ధూళి తూలి
చాలింతును నా జీవిత మిక !
ఈ చితాగ్నియే శరణ్య మిక !!

# ప్రబోధ గీతి

మూతపడిన కన్నులు తెరువవో
ప్రాతఃకాల ప్రభలు విరియవో
దుఃఖతమోవృతధరాతలముపై
సౌఖ్యభానుసందేశము నీయవో !

కఠినశిలాహృది కరిగింపవో
శిశిరతరుశాఖ చిగురింపవో
హింసాకులధరణీతలమందు
అహింసాయుతశాంతికాంతు లొలుకవో !!

## పాపీ !

పాపీ ! ఓహో పాపీ !—నీ
పాప మ దెంతటిదైనా పశ్చా
త్తాప మందరా పాపీ !!

పశ్చాత్తప్తుని హృదయముపై పర
మేశు కరుణ వర్షించుర పాపీ !! పాపీ !!

కీటకమై తొలిజన్మలోన నా
నాటికి పుణ్యము నార్జన సేయుచు
కోటికోటి యుత్తమజన్మల గని
నేటికి మానవజన్మ సందితివి ! ! పాపీ !!

నరజన్మములో పుణ్యముచేసిన
మరి యే జన్మములేని ముక్తిరా !
పరమేశుని దయ పాపాత్ములకిల
దొరకదు కోటి కోటి జన్మలకును!! పాపీ!!

హింసారహితము కరుణామహితము
సంసారము భూలోకస్వర్గము

చేజేతులనే సంసారమ్మును
చేసికొనెదు స్వర్గనరకములుగా!

పాపీ! ఓహో పాపీ!—నీ
పాప మెంతటిదైనా పశ్చా
త్తాప మందరా పాపీ!
పాపీ! ఓహో పాపీ!!

# ధర్మచక్రము

సాగునదే! సాగునదే!
ధర్మచక్రము! ధర్మచక్రము!
ఏగునదే! ఏగునదే!
జగతి నలుదెసల నా చంద్రార్కము!! సాగునదే!!
పిలుచునదే! వినబడదో!
శిలలు ద్రవించు కరుణతో
పిలుచునదే! యెద యెద
హత్తించు ప్రేమగళమ్ముతో!! సాగునదే!!
రాజు, రౌతు, ప్రభువు, బంటు
యతి, గృహస్థు చనుమార్గము
సర్వసమము, శాంతికాంతి
పథ మవక్రము! ధర్మచక్రము!!
సాగునదే! సాగునదే!
ధర్మచక్రము! ధర్మచక్రము!
ఏగునదే! ఏగునదే!
జగతి నలుదెసల నా చంద్రార్కము!!

# గీతాంజలి

ఓయి మహాత్యాగీ ! ఓహో భవ్యయోగీ !
అహో తపస్వీ! హే మహాత్మ! జోహారు! జోహారు !

భరతప్రజ శాంతిసమర
భద్రవీరవరుల జేసి
గురుతపమున భరతమాత
పరతంత్రత బాపినావు !!

అన్నదమ్ము లన్యోన్యము
హత మొనర్చుకొనుట మాన్ప
భార మనక ధీరత మెయి
ప్రాణము లర్పించినావు !!

కరమున వరచక్ర మెత్తి
హరిజనాళి రక్షించితి !
రామచరణ పారాయణ !
శ్రీ దరిద్రనారాయణ !!

శిష్టగతుల చెలగింపగ !
దుష్టమతుల తొలగింపగ
జగతీధర్మము నిలుపగ
యుగయుగముల నవతరింతు ! !

ఓయి మహాత్యాగీ ! ఓహో భవ్యయోగీ !
అహో తపస్వీ ! హే మహాత్మ ! జోహారు ! జోహారు !

## జోత !

ఇదె జోతా నీ కిదె జోతా !
ఓ స్వతంత్ర భారతపితా !

పరిపాలనలో దాస్యాంబుధిలో
తెరువు నెఱుంగని దీర్ఘనిద్రలో
మరగిన నరులకు సత్యాగ్రహ మను
వరాయుధమ్ము నొసంగిన నేతా !

నీ కిదె జోతా ! ఇదె జోతా
ఓ స్వతంత్ర భారతపితా !

మన్నిక గలిగిన నరజాతులలో
ఎన్నిక గలదోయ్ మన జాతియునని
మా కొక దేశము మా కొక జెండా
మాకొక ఉన్నతి నిచ్చిన నేతా !

నీ కిదె జోతా ! ఇదె జోతా
ఓ స్వతంత్ర భారతపితా !

కరుణాశేషువు కవ్వపుత్రాడుగ
మతిగెడుపగలే మంథానాద్రిగ
నరుల హృదంబుధి తరచి తరచి శాం
తిరూప సుధ నందించిన నేతా !

నీ కిదె జోతా ! ఇదె జోతా !
ఓ స్వతంత్ర భారతపితా !

ఇదె జోతా ! నీ కిదె జోతా !
ఓ స్వతంత్ర భారతపితా !

## పూజాశిరీషములు

పూజాశిరీషము లివిగో—మా
పూజాశిరీషము లివిగో!!
ఓ జీవదయాపర! బాపూ! మా
పూజాశిరీషము లివిగో!!

భరతావని జన్మించితివా
అవతారమూర్తివై మించితివా!
చరఖా చక్రాయుధధారీ! హే
దరిద్రనారాయణశౌరీ!! ఓ జీవదయాపర!!

నిరుపమాన జనతానేతా! హే
భరతస్వాతంత్ర్యవిధాతా!
సత్యాగ్రహమంత్రోద్గాతా! హే
ప్రణయహృదయలోకవిజేతా!! ఓ జీవదయాపర!!

మానవతా ప్రపూర్ణమూర్తీ ! హే
అమరమధురజీవనశక్తీ !
అసమానస్వార్థత్యాగీ ! హే
అద్వితీయసమతాయోగీ ! !
ఓ జీవదయాంబర ! బాపూ ! మా
పూజాశిరీషము లివిగో ! !

# పృథ్వీప్రశంస

పృథుల క్షమాశాలినీ! పృథ్వీమాతా!
గగనపథస్వేచ్ఛాగామినీ! కాంతిప్రపూతా!!
శశ్వన్నవరాగ నవోష స్తేజస్వినీ!
అనశ్వర విశ్వాంధ ఘన సంతమస్వినీ!!
ప్రచలదాంతరోజ్జ్వల జ్వల జ్వాలామాలినీ!
అచలశాంతిమయ తుహినాంబరధారిణీ! ధారుణి!!
నందిత శతసహస్ర హృన్నందన మధుకలస్వనీ!
క్రందిత శతకోటిక్లాంత బృందశోక వికిరధ్వనీ!!
వినయ ముగ్ధప్రణయస్నిగ్ధ విసృత సుహృన్మణీ,

విద్వేషవిభేదవాద వికల ప్రకృతిఖనీ,
నిరవధికవికారిణీ! నిస్తుల
నిత్యసత్యసౌందర్యప్రస్తారిణీ!!

దిక్కాలాతీత దివ్యశరీరిణీ! ధరణీ!
పృథులక్షమాశాలినీ! పృథ్వీమాతా!!

# లలితాస్తుతి

మాహేశ్వరీ, మహాకాళీ
పాహి సృష్టి లయంకరీ !
ఆదిశక్తీ కాళరాత్రీ
అళికనేత్రి శాంకరీ !! మహేశ్వరీ !!

మహారూపా, మహామాయా
మహాశక్తి, మహారతీ !
మహాబుద్ధీ, మహాసిద్ధీ,
మహాతంత్ర, మహామతీ !! మహేశ్వరీ !!

పంచప్రేతాసనాసీనా
మహాభైరవపూజితా !
ముక్తదంష్ట్రానలోర్మికా ! హే
రక్తనేత్రజ్వాలికా !! మహేశ్వరీ !!

రుధిరసక్తా మాంసనిష్ఠా
వారుణీమదవిహ్వలా !

కాలకంఠీ పరాశక్తీ
కపాలమాలాన్వితా !! మాహేశ్వరీ !!

హే శూలధారిణీ హే శ్యామగాత్రా!
హే రుద్రరూపిణీ హే శోణవక్త్రా !
భగవతీ భైరవీ విశ్వాధికా !
రుద్రమూర్తీ శ్యామ నాదరూపా !
ఈశ్వరీ క్షోభిణీ విశ్వసంక్షోభిణీ !
లోకకల్లోలినీ హాకినీ రూపిణీ !
నిర్భవా భవనాశినీ వజ్రధారిణీ !
మూలశక్తీ జగన్మాతా భవానీ !
నమశ్శక్తిదాయినీ హే ముక్తిదాయినీ !
హే క్షణక్షణసంకలితపాలితప్రలయి
తానేకవిశ్వాత్మికా !
ప్రకృతిపూరుషకళాకృద్ధ్వయైకాత్మికా !
అద్వయానందసచ్చిదనంతదీపికా !
పాహి లలితాంబికా !
పాహి మాం పాహి మాం పాహి !!

# మహోదయం

మహోదయ మాయె నహో! అహో!
శుభోదయ మాయె నహో!

దెసదెస కెంజాయల కొస లలముగ
మసలుచు ప్రాకే తొలుసంజె!
ఎసగే కాంతి శలాకల మాటున
పసలుడుగు నిసుల వెనుకంజె!

మహోదయ మాయె నహో! అహో!
శుభోదయ మాయె నహో!

తోటల బాటల చీకటి చాటుల
చలిమంటల వెలవెలలోన!
తూరుపు వాకిలి బంగరు తలుపుల
జయగంటల గణగణలోన!

మహోదయ మాయె నహో ! అహో !
శుభోదయ మాయె నహో !

తెలతెలపోయెడి చుక్కలదారుల
కలకలపులుగుల పిలుపులలో !
క్కొక్కొరొక్కో యని గొంతుల నిండుగ
కుక్కుటముల మేల్కొలుపులలో !

మహోదయ మాయె నహో ! అహో !
శుభోదయ మాయె నహో !

చెంగున గెంతే లేగల సాకుచు
చెలగే అంభారవములలో ! !
లేవడి కరవులు లేవని చాటే
ముంగిటి ధాన్యపురాశులలో ! !

మహోదయ మాయె నహో ! అహో !
శుభోదయ మాయె నహో ! !

# స్వాతంత్ర్యస్వప్నం

విధుర హేమంత మరిగినదోయి!
మన కింక

మధుర వాసంతమ్మె కలదోయి!
ముసరు చీకటితోట
మసలు నాకటి బాట
ఎసగు వెన్నెలతోట
పసిమి పన్నెలబాట!

మనసు మసకల రేయి చనెనోయి!
మన కింక

తెలివి వెల్గొరయు పవలేనోయి!
ఒరగు పీన్గులవాడ
మలుగు మూల్గులమేడ
కేరలు నాటలవాడ
వరలు పాటలమేడ!

నాల్గువీథుల జాటిరమ్మోయి !
వాసంత
నవశుభోదయము సమయమ్మోయి !
వాడవాడల దిరిగి
మేడ లన్నిటి కరిగి
తోడి సోదరుల నీ
కూడ గొనిరమ్మోయి !
ఊడిగపు బ్రతుకు గడచినదోయి !
మన తల్లి
వాడవాడల స్వేచ్ఛ గనెనోయి !
కలిమి గల్గిన తల్లి
కడుపు చల్లని తల్లి
పసిడివలువల తల్లి
పంటవలతే తల్లి
వలపు విరిదండ గొనితెమ్మోయి !
మన తల్లి
గళమందు వేయ రా రమ్మోయి !
ఒత్తని యకరులతో
మెత్తని దళాలతో

క్రొత్త యామని పూలు
కొమ రొప్పు కమలాలు !
దేవికి నివేదన మిమ్మాయి !
మధురమా

దివ్యామృతము స్వేచ్ఛనుమ్మాయి !
తల్లి బానిసతనము
నెల్ల బాసిన మనము
వైనతేయుల మమృత
మానుదము రా రమ్ము !
విధుర హేమంత మరిగినదోయి !
మన కింక
మధుర వాసంతమ్మె కలదోయి !!

# స్వతంత్ర భేరి

మ్రోయింపు జయభేరి !
వాయింపుము నగారా !
తేలింపుము నభోవీధిని త్రివర్ణాంచితపతాకా !
భారతదేశ స్వేచ్ఛాసూర్యు నాచ్ఛాదించు రాహుచ్ఛాయ
అంతర్ధానమాయె !...అంతర్ధానమాయె !
మ్రోయింపు జయభేరి !

స్వార్థ మ్మనక సౌఖ్య మ్మనక
సంగ్రామమున పోరి
వీరస్వర్గ మేలగ చనిన
ధీరులకెల్ల జోహార్ !

జోహార్ వివిధరాష్ట్రవీరయోధులకు జోహార్ !
జోహార్ వీరమాతలకును పత్నులకు జోహార్ !
ఉదయమ్మాయెను స్వేచ్ఛాభారత
ముదయమ్మాయె నహో !

తూరపుఖండపువారల తపములు
కోరిక లీడేరెనహో!!

దెసలల్లిన భారత స్వేచ్ఛాసూర్యుని
ప్రాభాతోజ్జ్వలకాంతి!
ప్రసరించుత తూరుపువాకిలి తెరచుక
ప్రేమపూరితప్రశాంతి!!

దేశదేశముల దీనజనానికి దాస్యబంధన విముక్తి
ద్వేషరోషములు తెగలు పగలు
నశియింప జగమెల్లశాంతి!!

# బౌద్ధభారతవసంతము

నవవసంతము నే డహో

ఎన్నవ వసంతము నే డహో!

దిక్కుదిక్కుల బోధివృక్షపు

దివ్యశాఖలు చివురు లెత్తెను!

బోధిసత్త్వుని బోధనామృత

దీధితులు లోకాన వెలిసెను!! నవ!!

ఆరామవీథికల

ఊరూరబోధకులు!

ఇంటింట సాధకులు

బాధాపనోదకులు!! నవ!!

ఆ మేరువును దాటె

అంభోధులను దాటె

ఆ అహింసాపథము

త్రిజగదాశాపథము!! నవ!!

బుద్ధదేవునిసూక్తి
ఇద్ధ మని యనురక్తి
గళము విప్పి పాడు
నవవసంతము నేడు !! నవ !!

నవవసంతము నేడహో
ఎన్నవ వసంతము నేడహో !!

# వాగమృతద

అగణిత శుభదాయినీ! వాణీ! హే జననీ!
వేదవినుతా! రాగమహితా! వాగమృతదా శారదా!
వికలపాపా! విహృతతాపా! సకలసుగతీసాధనీ!
దేవమానీవందితపదా! దివ్యలోకావాసినీ! అగణిత!!
వరకమల మనోహారిణీ! కమలముఖీ! కమలాకరవిహారిణీ!
సితశాంత శశికళాహాసనీ! సుకవితాకళావిలాసినీ!
నిరుపమ కరుణాకలితా! అకలుషనవరసభరితా! అగణిత!!
లోకలీలారచనశీలా! అతివిశాలా భారతీ!
ఆదిప్రకృతీ! అంబికా! ఆర్తజనతా సురలతా!
గానలోలా! కలవిపంచీస్వరఝరీ మదభరీ! అగణిత!!
శాంతియుతా! చారుమతీ! చతురకథాసారమతీ!
హేమాతా! ప్రపూతా!
శాంతియుతా! లలిత కళాకోమలమేఖలాశోభితా!
నవయుగజీవనభావనధాత్రీ!
కవిజనహృదయరతా సావిత్రీ! అగణిత!!

# 'ద్వారం' వారికి ఆశీః సుమగీతి

నీ యాశీ! సుమరాశి చల్లుమా!
ఓ సరస్వతీ! కళాధిదేవతా!

ప్రతిభావంతుడు వినయవినమితుడు
సేతుశీత నగవిఖ్యాతుండు
శిల్పకల్పనాపారావారము
మా అమూల్యవరమా ద్వారముపై!

తన సాధనచే తన తపస్సుచే
తన గానకళావైశద్యముచే
తన రాష్ట్రమునకు తన దేశమునకు
ఘనతను కూర్చిన మా ద్వారముపై!

తానాలాపములందు స్వరములకు
ప్రాణము పోసిన ఘననయఘణితుల
మానవహృదయపుతంత్రుల తాకే
మధురగాయకుడు మా ద్వారముపై!

హృది పులకించు ధనుష్టంకారము
బ్రతుకులు చివురించే ఓంకారము
రాగరసానందపదద్వారము
తనకు వరములా మా ద్వారముపై !

నీ యాశీః సుమరాశి చల్లుమా!
ఓ సరస్వతీ! కళాధిదేవతా !

# యుగకర్తా! అభివాదాలు!!

కందుకూరి వీరేశలింగం
నీ వొక మహోన్నతశృంగం!
ఎందుకు జన్మించాడో
ఈతడని ప్రశ్నిస్తే—
ఇందుకని జవాబు వచ్చే
వందనీయు లందరిలో
కందుకూరి వీరేశలింగం
నీ వొక మహోన్నతశృంగం!
నీవు జీవించినప్పుడు
నేను జన్మించనే లేదు
అప్పుడు నీతో జన్మించడం
అదొక అదృష్టమే అయినా
ఇప్పుడు జన్మించడమే
ఇదే నా కదృష్ట మనుకుంటా!

నీ జీవించినరోజుల్లో
నీ వొక్కడవే ఒక వెలుగు !
నీ చుట్టూ మహాంధకారం
నే నందులో బ్రతికుండునా ?
నీ తరవాత ఒక నూరేళ్ళకి
నీ కిరణాలే మే మంతా !
నీ జీవించిన ఆ దినాల్లో
నిద్రిస్తోం దీ జాతంతా !
నిద్రితజాతిని లే లెమ్మని
విప్లవశంఖం పూరించావ్ !
నీ తరవాత ఒక నూరేళ్ళకి మే
మంతా నీ జయశంఖాలం !

ఈ యుగాన తొలిరోజుల్లో
నీవే జన్మించకపోతే
ఆంధ్రజాతి అనేకయుగాలు
అష్టదరిద్ర మైపోయేది !

పీడితజనులకు ఊరటగా
బాసట ఐ నిలిచిన దెవరు ?

అన్నపూర్ణవంటి గృహిణితో
ఆర్తజనకుటుంబివి నీవే !

నిరంకుశుల కాఠిన్యం
ఎదిరించ సాహసించిన దెవరు ?
మేరుధీర హృదయేశ్వరితో
వీరయోధవరుడవు నీవే !

మూఢాచారపు సంకెళ్లను
ముక్కలుగా త్రెంచిన దెవరు ?
జ్ఞానశీల ప్రాణేశ్వరితో
సత్యధర్మపరుడవు నీవే

తన సౌఖ్యాన్నే మరిపించే
త్యాగబుద్ధి చూపిన దెవరు ?
సహనశీల రాజ్యలక్ష్మితో
మహామహితాత్ముడ వీవే ?

తెలుగుతోట క్రొత్తదారుల
క్రొత్తపైర్లు చల్లిన దెవరు ?

అమలవాణి భాషాపతితో
అమరగురుసమానుడ వీవే !

చరిత్రలో సాహిత్యంలో
పరిచిన నీ తొలిదారుల్లో
ఉన్నతభావాలు స్మరిస్తూ
నీ అడుగుల వెనుకనె వస్తాం !

మూరేడుల ప్రతిజయంతికీ
నీ విజయం ప్రతిధ్వనిస్తాం !

ధన్యభరతమాతృపుత్రా !
అభినవాంధ్రచరిత్రకర్తా !
నీ పవిత్రపాదాల కివే
మా నిరంతరాభివాదాలు !!

# మా తృ భూ మి

హే భువనమనోమోహినీ
నిర్మలసూర్యకరోజ్జ్వలధారుణీ-జననీ !! హే !!
నీలసింధు నిర్మల జల
ధౌతచరణ కమలతల
అనిల విచంచల కోమల
శ్యామల నవ సస్యాంచల
అంబర చుంబిత విశాల
ఫాల హిమాచల !
ధవళ తుషార కిరీట సుశోభినీ-జననీ !! హే !!
తొలి ప్రభాతమున నీ గగనమున
తొలి తపోవనుల సామరవమున
ఎన్నో జ్ఞానధర్మకాంతు లొలసె
ఎన్నో మహాకావ్యతతులు వెలసె
చిరకళ్యాణమయీ అతిధన్యశీలవమ్మా
అవిరళవితరణశీలివి అన్నపూర్ణవమ్మా
యమునాజాహ్నవీగలితకరుణాకలితా
పుణ్యమధురపీయూషస్తన్యవాహినీ జననీ!! హే !!

# సరోజిని

అందుకొనుమా ఈ సుమాంజలి!
అమరగాయనీ! సరోజినీ!

వీరనారివై స్వతంత్రతా
ఘోరరణంబున పోరితివి!
విదేశీయులకు భారతవిదుషీ
వికాసమును ప్రకటించితివి!! అందు!!

అజ్ఞానపు టంధకారము
హాత మొనర్చు నిశితదృష్టితో
వక్తవౌచు సూక్తి మురళిని
పలికించితి సుధావృష్టితో!! అందు!!

జీవమురళి మూగవోయినా
భావసరళి మధురగీతమై
దేశదేశముల యుగాలుగా
ఆశాశల మ్రోగుచుండులే!! అందు!!

# సరోజిని

భారత స్వాతంత్ర్య భవనసంధాత్రి!
మాన్య మకుటోపేత మహిత జనయిత్రి!
మా జోతలివె ఓ సరోజినీదేవి!

వంగదేశీయవిద్వద్వంశమందు
ఆ హరీంద్రుని యక్క వౌచు జన్మించి
కమనీయభావాల కవయిత్రి వౌచు
పాశ్చాత్యభాషల ప్రౌఢ వనిపించి
ముత్యాలనాయని మురిపెంపు సతివై
తెలుగుకోడలి వౌచు తేజరిల్లితివి?
మా జోతలివె ఓ సరోజినీదేవి!

నీ కంఠమాధురీ నిభృతగీతికల
రాజదండంబైన రమణీయమురళి
నీ రాష్ట్రపాలనా నిర్వహణమున
సర్వప్రియత మ్రోగి సార్థక మ్మాయె!
అతిరథ వగుదు, మహారథ వగుదు
ఆత్మవేసుమి భారతాంబకు నీవు!!
మా జోతలివె ఓ సరోజినీదేవి!!

## అంజలి

అంజలిదే మానవోత్తమా !

అఖిలలోకపితా! మహాత్మా! అంజలిదే!!

మకుట మేల బిరుద మేల

మహిత సార్వభౌమా ! నీ

అకలంకప్రేమ నేలినావు

సకల భూమండలి!! అంజలిదే!!

తనలోపల జీవాళిని

తన్ను సకల జీవులలో

కనుగొను కరుణామూర్తీ !

ఖేదమోద సమవర్తీ!! అంజలిదే!!

ఆ తథాగతుండు క్రీస్తు

అవని బ్రోవ నీవె యూచు

ఆ యహింస పరమధర్మ

మను సత్యము నెలకొల్పిరా!! అంజలిదే!!

లోకప్రజ హృదయమ్ముల
ఏకత్వము నీకు శాంతి !
దశదిశలను నీ యాశీః
ప్రసవవృష్టి మాకు కాంతి !!

అంజలిదే మానవోత్తమా !
అఖిలలోకపితా ! మహాత్మా !!

# శాంతిదూత

జయ జయ భారత భాగ్యవిధాతా!
జగత్ శాంతిదూతా !
జగతికెల్ల శుభదినమ్ము నీదగు
జన్మదినము సత్యమార్గనేతా !

ధన్య నిన్ను గన్న యీధరిత్రి !
ధన్య మా భరతధాత్రి !
పరమధన్యులము భారతీయులము !
బాపు మా గురుడ వీవె !!

పగలు తెగలు మఱచి నిఖిలప్రజ నీ
పథమున నెద యెద గదియ జేయునో !
రగులు లోభమోహములు నశింపగ
రామరాజ్య మీభువి నిక వెలయునో !!

జయ జయ భారత భాగ్యవిధాతా !
జగత్ శాంతిదూతా !!

# సర్వోదయము

ఓ బాపూ ఓహో బాపూ మా బాపూ మా ప్రియ బాపూ!
నీ జీవన మధురస్వప్నంలో
మా జీవితమార్గం దీప్తంగా మము
దీవిస్తున్నావా చిరునగవున
పరికిస్తున్నావా!                    ఓ బాపూ!!

మనిషి మనిషీ తకిలీపట్టి
నిమిష నిమిషం నూలువడుకుతే
తనకు తానే వస్త్రదాతయై
జగం సర్వం సుభిక్ష మౌను!

ఇదే మంత్ర మాదేశించావ్
విదేశాల చూపే లన్నావ్
స్వదేశీపరిశ్రమ యెడల
ఉదాసీనతను మాన్పించావ్!! బాపూ!!

ఆచరణములను ఆకులచుట్టూ
ఆదర్శమ్మను సూత్రము కట్టి
సూత్రపు కొస శ్రద్ధను కదు రుంచి
ధర్మచక్రం ప్రవర్తించితే
సర్వజీవితాధారం దారం
లాగగ లాగగ సాగుతు వస్తే!!

అనురాగమె కండెలుగా చుట్టి
పడుగూ పేకా అడ్డం నిలువూ
పరచుకు పేర్చుకు అల్లుకుపోతే
జీవితములు వస్త్రావృత మౌను ! !
బాపూ ఓహోహో బాపూ ! !

# ఉగాది

స్వతంత్ర భారతజననీ, నీ కిదె
నితాంత నవనీరాజనము
అశేష పూజాశిరీషములతో
అగణిత నరనారీజనము !!

స్వతంత్ర భారతజననీ !!

వదలెను చిరదాస్యపుశృంఖలములు
చెదరెను దైన్యతమఃపటలమ్ములు
ఆసేతుహిమనగ మ్మొకపాంగై
అలముకొన్న ఆనందతరంగము !!

స్వతంత్ర భారతజననీ !!

బలిమికి జేగురు, తాల్మికి తెల్లన
కలిమికి పచ్చన, కర్మచక్రము,
వాడ వాడ నీ హృదిలో మేడల
నేడు త్రివర్ణపతాకములే !!

స్వతంత్ర భారతజననీ !!

పచ్చనితోటల నే యెడ విని నా
స్వేచ్ఛాపికములు నిండుగళమ్ముల
హాయి హాయిగా రెక్కల విప్పి చే
తీయని గీతీహారతు లే !!
స్వతంత్ర భారతజననీ ! !

త్యాగమూ ర్తియగా మహాత్ము డొసగిన
శాంత్యహింస లే సదాశయములుగ
సకల వసుంధర నేకము చేయగ
అకలంకులమై ప్రతినలు నేతుము ! !
స్వతంత్ర భారతజననీ ! !

# స్వాతంత్ర్యఘంట

స్వాతంత్ర్య శుభోదయ ఘంటా
నాదం బదె మ్రోగెను మింట!
టంఠం టఠం టఠటం!
టంఠం టఠంఠం!

వీతెంచె నవాశామారుత
మోతల్లీ! మా నవభారతి!
టంఠం టఠం టఠటం!
టంఠం టఠంఠం!

నీ పదాల కెరగెడు శిరాలు
నీకు జోత లిడు మాకరాలు!
నీ కిడు నవగీతిహారతి!
మా తల్లీ! ఓ నవభారతి!
టంఠం టఠం టఠటం!
టంఠం టఠంఠం!

పగలు తెగలు తగవులు మరచి
నగుమోగాల హృదులను తెరచి
కనబడు నీ చల్లని మూరితి
జననీ ! ఓహో నవభారతి !
టంతం టతం టతటం !
టంతం టతంతం !

భర్మసస్యకాంతుల నడుమ
కర్మచిహ్న ధర్మచక్రమై
కూర్మి పేర్మి చాటెడు కీరితి
నీ పతాక ! మా నవభారతి !
టంతం టతం టతటం !
టంతం టతంతం

సత్యాగ్రహమంత్రగురుండు
శాంతిదూత యోగివరుండు
స్వాతంత్ర్యమహారథసారథిఁ
గన్నతల్లి ! మా నవభారతి !
టంతం టతం టతటం !
టంతం టతంతం

స్వాతంత్ర్యశుభోదయఘంటా
నాదం బడె మ్రోగెను వింట !

టంఠం టఠం టఠటం !

టంఠం టఠంఠం !!

# నవభారతసందేశం

అహో నవప్రభాతము!
శుభాశాపరిపూతము!!

స్వాతంత్ర్యోజ్జ్వలయువాశయోత్సాహోపేతము!!
అదె స్వతంత్ర భారతదేవాలయ ఘంటారావము!
అదె అశోకచక్రాన్విత త్రివర్ణకేతనహాసము!
అదె స్వరాజ్య ప్రజాభోజ్య సువర్ణభవనవికాస
మహోనవప్రభాతము!
శుభాశాపరిపూతము!

ఆసియా నివాసులార! స్వాతంత్ర పిపాసులార!
స్వాతంత్ర్యమ్మున కర్హులు సకలమానవు లని చాట
బర్మా చైనా జావా ప్రజలు మనకు తోడు నే
డహో నవప్రభాతము!
శుభాశాపరిపూతము!

శాంతి కాంతిపరిపోషము ధర్మచక్రపరివేషము
సత్యసమ్మితావేషము మహాత్ముమహోపదేశము
జగత్కుటుంబాదర్శము నవభారతసందేశ
మహోనవప్రభాతము!
శుభాశా పరిపూతము!!

# స్వాతంత్ర్యోత్సవ పుష్పాంజలి

మాదీ స్వతంత్ర దేశం
మాదీ స్వతంత్ర జాతి !
భరత దేశమే మా దేశం !
భారతీయులం మా ప్రజలం !!

వింధ్య హిమవత్ శ్రీ నీలాద్రుల
సంధ్యారుణిత నవాశలు మావి !
గంగా గోదావరి సహ్యజా
తుంగతరంగితహృదయాల్ మావి !!

ఆలయమ్ముల శిల్పవిలాసం !
ఆరామమ్ముల కళాప్రకాశం !
మొగల్ సమాధుల రసదరహాసం !
మాకు నిత్యనూతనేతిహాసం !!

అహింసాపరమోధర్మః
సత్యం వద ధర్మం చర

ఆదిఋషుల వేదవాక్కులు
మా గాంధిగౌతముల సువాక్కులు!!

స్వతంత్రతా భ్రాతృత్వాలు
సమతా మా సదాశయాలు!
జననీ! ఓ స్వతంత్రదేవీ!
కొనుమా! నీవాళులు మావి!!

# ప్రబోధము

జైహిం దని జైహిం దని
నడు ముందుకు ! నడు ముందుకు !
మువ్వన్నె పతాక నెత్తి
ముందుకు నడు, నడు ముందుకు !!

ముం దేమిటి గమ్య మ్మని
ఎందుకు ప్రస్థాన మ్మని
అద రెందుకు, బెద రెందుకు
ఎదు రే లేదని ముందుకు
ప్రణయయోగి గాంధిబోధ
ప్రపంచైక్యతకు మందని !!
జైహిం దని !!

కలకత్తా అమృతసరూ
కాకినాడ కథేవరూ
కాశ్మీరం డార్జిలింగ్
కన్యాకుమారి పూరీ

ఆసేతుహిమాచలమూ
అంతా మందే హిందని ! !

జై హిం దని ! !

లేదు లేశమును మాకే
దేశ మాక్రమించు నాశ !
మా పురాణభూమిపైని
సైప బో మొకరి దురాశ !
లే దిక పరతంత్ర దేశ
మీ ధరిత్రి నికముందని ! !

జై హిం దని ! !

భేదవాదసంకులమై
భీకరసమరాకులమై
పరస్పరవిమారకమౌ
బహుళజాతిపుంజమందు
సత్యాఽహింసాత్మకమౌ
నిత్యధర్మమార్గదర్శి
ప్రాచ్యగగనపరంజ్యోతి
భవ్యభారతియె మందని !!

జై హిందని ! !

# అభినందనము

* (విజయవాడకు)

అభినందన చందనపవనసుగంధము లివిగో!
ఆనందితహృదయసుమ నవమరందము లివిగో!
విజయవాటికా !

ప్రాచీనభరతబౌద్ధార్షజ్ఞానపేటికా !
ఇంద్రకీలదుర్గాచలవరకిరీటికా !
కృష్ణాతరంగచుంబితమృదుపాదపీఠికా !
అభినందన చందనపవనసుగంధము లివిగో !

నభోవాణి నవోన్మేష శుభసంధ్యారుణిమ
సకలకళాసాహితీ కలితనాదమధురిమ
వికసితకోటిత్రయాంధ్ర నయనయుగళితరళిమ !
అభినందన చందన పవనసుగంధము లివిగో !
ఆనందితహృదయసుమ నవమరందము లివిగో !!

---

* (విజయవాడ ఆకాశవాణి ప్రారంభోత్సవము.)

# తెలుగుతల్లి

తెలుగుతల్లీ ! యశఃకల్పవల్లీ !
ఎసగు పైడిపైరుల పాలవెల్లి ! !

కాలవాహినీ బహుతరంగాల
కదలని ధరాపరాగ వేదికల
నిభృతమా మహోన్నతచరిత్ర లివే !
ప్రసవమాలగా నీ గళమ్మునకు ! !

తెలుగుతల్లీ ! యశఃకల్పవల్లీ !

రాల రాగిరేకుల మలయుగీతలు
తాళపత్రాలపై వెలయు కైతలు,
వీరజనపదమ్ముల కథలు, గాథలు,
నీదు చరితాల సారంపుబోధలు ! !

తెలుగుతల్లీ ! యశఃకల్పవల్లీ !
ఎసగు పైడిపైరుల పాలవెల్లి ! !

# మంగళం

మంగళమ్మమ్మ ఆంధ్రావనీ!
మహితస్వర్లోకగోరూపిణీ!
మంగళమ్మమ్మ ఆంధ్రావనీ!! మంగళ!!

గౌతమీ తుంగభద్రా కృష్ణవేణీ త
రంగ మధుర స్తన్యవాహినీ!!
తిరుమల శ్రీ సింహాచలశైలశృంగినీ
స్నిగ్ధరత్నవిభూషితాంగినీ!! మంగళ!!

విహరింపవమ్మ స్వేచ్ఛావిహంగపథాల
కటిగతస్వర్ణమేఖలవై
నికటవర్తి కోటిత్రయాత్మజార్పిత
విశృంఖలసుమాంజలివై విలోలసస్యావలీ
శ్యామలాంబరవై విహరింపవమ్మ!! మంగళ!!

మార్మోగనీ అనారతము నానాజాతి
జనసభాంగణములలో

విజ్ఞపండితత్వతత్వతావళిగళమ్ములన్

ధర్మసద్గుణములన్ మార్గాగ్రగనిమ్మా !! మంగళ!!

న_ర్తింపనీ సగర్వమ్ముగా దేశదే

శాల సువిశాలకేతనములన్

నీదు కేతనములన్

మా గొప్పతనములన్ న_ర్తింపనిమ్మా !! మంగళ !!

# విజయప్రభాతము

విందు రే మే మనే మే మని?
కందు రే మే మనే మే మని?
అంద రిటు రండి చూడం డని!
సుందరము విజయప్రభాత మని!
అందరికి కొ త్త ఆమని యని!!

విశాలావకాశాంతరాలందు వ్యాపించి
లోకాన శంకాకులానేక విద్వేషవిద్రోహముల పెంచు
మాయావృతాశేషభీతిప్రదచ్ఛాయ లవె వెల్వెలన్
[జారె!

దిశలన్ నిశారాజ్ఞికేశాంధకారప్రభల్ తీరె!
ఎదలన్ నిరాశావృతోద్రిక్త సందేహభావాల్ తిరోగా
[ములై పారె!!
దిక్కామినీఫాలభాగాన, నున్నంచు సోనల్ చెలంగంగ
సుస్నాతసౌందర్య మొల్కంగ

గిరులందు తరులందు గుహాలందు
తమగూడులను నిద్దురలు తీరిన శకుంతముల చిన్నిచిని
[నోళులందు
తీయ నగు ఎర్రావలింతలన్, తల్లిపొత్తిళ్ల త్రుళ్లింతలన్
ఎరకకట్టుచు అప్పుడప్పుడే చాచు పక్షముల విదిలింతలన్
లేతకోరికల కదిలింతలన్— విందురే మే మని!!

చెల్లచెదరై సన్నగిల్లు నీహారమున,
ఏరులై పారు బంగారమున,
సూర్యవిభు తేరు గోపురపు కోటీరమున,
మిలమిలలలో తళత్తళతళలలో ధగద్ధగధగలలో,
రాశులై పోసిరో కుంకుమ స్ఫురింపించు
రమ్యసంధ్యావర్ణ రాజిలో

నీలసుశ్యామలారుణముఖ్యసప్తవర్ణాశ్వదీధితుల వెల్గేన
[భూరేఖలన్,
పుణ్యభూముల పవిత్ర నదీనదమ్ములన్,
ఓంకారపూర్వమ్ముగా గీయమానమ్ములౌ
వేదగాయత్రినాదమ్ములందు— విందురే మే మని?

దగ్గరాయెను విజయ మనుచు,
దిగ్గు మని లేచి తల లూచుచు,
ఒక్కరొక్కరు తూర్పుదిశగా
చక్కగా రండి చూడం డని,
కొక్కొరో కొరా కొక్రొకో అని
కుక్కుటోద్బోధగీతమ్ములన్-విందురే మే మని?

గతము చెడ్డది, నిశాంధ మని, ఆ
గతమె మంచిది, సుప్రభాత మని!
సుందరము విజయప్రభాత మని;
అందరికి కొత్త ఆమని యని!

విందురే మే మనే మే మని?
కందురే మే మనే మే మని?